# ర ణ భే రి

సమర కవితా సంకలనం



సంపాదకులు:

శ్రీ దాశరథి రంగాచార్యులు, B. A.

ప్రకాశకులు:

చందా నారాయణ శ్రేష్ఠి

సికింద్రాబాదు.



'FAREWELL MY HEART'

BY

SRI GULAM JELANI (Sculptor.)

# సంపాదకీయం

ప్రకృతి ఒక్కొక్కసారి హుంకరిస్తుంది.
నియమాల్ని ధిక్కరిస్తుంది.
విలయతాండవం చేస్తుంది.

అప్పుడే,

నదులు గట్లు తెంచుకొని పొర్లుతాయి. పొంగుతాయి. ఊరూ, నాడూ జలమయం చేస్తాయి. కొంపా గోడీ ముంచేస్తాయి. పచ్చని పొలాల్ని పొట్టన పెట్టుకుంటాయి. పశువులూ, మనుష్యులూ జలచరాలు అయిపోతారు.

అప్పుడే,

ఝంఝూమారుతం వీస్తుంది. చెట్లు గట్లు కూకటి వేళ్ళతో కూల్తాయి. మింటినుంచి మంటిదాకా దుమ్ము మబ్బులు నిండుతాయి. గుట్టలే ఎగిరిపొయ్యేట్లు అవుతుంది.

అప్పుడే;

భూకంపం వస్తుంది. క్షణంలో అంతా తలక్రిందులై పోతుంది. చెట్లు, ఇండ్లు, అన్నీ కూల్తాయి. భూమి బద్దలు

అవుతుంది. ఒక్కొక్కచోట అగాధం ఏర్పడుతుంది. ఒక్కొక్క చోట మెట్ట తయారవుతుంది.

ఇట్లాంటివి ఇంకా ఎన్నో జరుగుతాయి. మానవుడు కలకాలంగా నిర్మించుకున్న సంపద నాశనం అవుతుంది. అతడు మళ్ళీ మొదటికి వస్తాడు.

ఈ విలయతాండవం ఎంతకాలం ఉంటుంది? అతి స్వల్పకాలం. మనం సరిగ్గా లెక్కవేయలేం గాని సృష్ట్యాది నుంచీ నేటివరకు గడచిపోయిన కోట్ల సంవత్సరాల్లోనూ అలా ప్రకృతి విలయతాండవం చేసిన కాలం మహా అవుతే ఒక శతాబ్దం అవుతుందో కాదో!

అయినా మనకు ఆ విషమగడియలే గుర్తుంటాయి. మూసీనది ఏనాడు పుట్టిందో? ఎంత నీరు దాన్లో ప్రవహించిందో మనకు తెలియదు. కాని అది పొంగి హైదరాబాదును ముంచివేసిన ఉదంతం మనందరికీ తెలుసు.

హైదరాబాదునుండి కాజీపేట వరకు రైలుమార్గం పడినా్నటినుండి ఎందరు ప్రయాణం చేశారో మనకు తెలియదు. కాని జనగాం రైలుప్రమాదం మనం అందరమూ ఎరుగుదుము. చరిత్ర సహితం ఇలాంటివాటినే రికార్డు చేస్తుందేమో!

సరిగా అల్లాంటిదే మానవ స్వభావమున్నూ. ఒక్కొకసారి మానవుడు ఉద్రిక్తుడు అవుతాడు.

తన నియమాల్ని ధిక్కరిస్తాడు. వేల
సంవత్సరాలుగా అబ్బిన నాగరికత, నీతి
నశిస్తాయి. ఏవేవో పిచ్చిపనులు చేసేస్తాడు.
ఆ ఉద్రేకంలో అతడు హత్య చేయవచ్చు.
దొంగతనం చేయవచ్చు. మానభంగం
చేసినా చేయవచ్చు.

తత్ఫలితంగా అనేక కష్టాలకు గురికావలసి కావచ్చు.

అలాంటి కాలం సహితం చాలమంది జీవితాల్లో ఏ స్వల్పకాలమో ఉంటుంది. ఆ కల్లోలమే మనకు ఎప్పటికీ గుర్తుంటుంది. ఎంత కాలం ఆనందంగా బ్రతికామని ఎవరికీ చెప్పుకోము. ఎన్ని కష్టాలు పడ్డామో చెప్పుకుంటాం.

"నా సుఖాల్లభతే సుఖమ్"

దేశాలూ, వాటి చరిత్రలూ అంతే. మనం చదివే రాజకీయ చరిత్రంతా సుమారు యుద్ధాలమయమే. ఈ దేశాల ఆయుువులో యుద్ధాలు ఎంత భాగం ఆక్రమిస్తాయంటారు! ఏ వెయ్యో భాగమో! అయినా వాటినే గుర్తుపెట్టుకుంటాం మనం.

సాహిత్యం వీ టన్నింటికీ దర్పణంలాంటిది.

అభివృద్ధి యావత్తూ శాంతికాలంలోనే జరుగుతుంది. మానవునిలోని విలువలు, సంస్కృతి, నాగరికత, సంపద అన్నీ శాంతికాలంలోనే తామరతంపరగా పెరుగుతాయి. అల్లాగే సాహిత్యమున్నూ. దేశం సుభిక్షమై

సంపదలు పొంగి పొర్లుతున్న కాలంలో మహాకవులు జన్మిస్తారు. వారు మహాకావ్యాలు రచిస్తారు. అప్పుడు వారికి ఆలోచించే అవకాశం ఉంటుంది. అట్లాంటి కావ్యాలు అజరామరములు అవుతాయి. సర్వకాల సర్వావస్థల్లో, సర్వజనుల జీవితాలూ ఆ రచనల్లో ప్రతిబింబిస్తాయి. ఏనాడో వేల సంవత్సరాల క్రితం రచించబడిన రచన వేల సంవత్సరాలు గడచిపోయిన తరువాత సహితం నిత్య నూతనంగా ఉంటుంది. అందుకు కారణం మానవ స్వభావంలో మార్పు లేకపోవడమే.

రామాయణం రచింపబడి కొన్ని వేల సంవత్సరాలు గడిచిపోయాయి. నాటిది ఏదీ నేటికి మిగల్లేదు. పోనీ మిగిలిందే అనుకున్నా అవి నేడు పనికిరావు. రాముడు వాడిన బ్రహ్మాస్త్రాదులు, రథాలు, నాటి భవనాలు నేడు మనకు లభించాయే అనుకుందాం. అవి మనకు ఎందుకు పనికివస్తాయి ? పురాతత్వశాస్త్రజ్ఞులు ఒక వస్తు ప్రదర్శనశాలలో ఉంచడానికీ, మనం ఏనాడో ఒకనాడు చూచి ఆనందించడానికీ మాత్రమే పనికివస్తాయి. అలా కావడానికి కారణం ? నాటి అస్త్రాల్ని తలతన్నిన మారణాయుధాలు నేడు వచ్చాయి. నాటి రథాల్ని తలతన్నిన వాహనాలూ, నాటి విమానాల్ని తలతన్నిన విమానాలూ నేడు మనకున్నాయి. అలా అంటున్నామూ అంటే మన నాగరికత అంటే బాహ్యావేషం ఎంతగానో మారిందని అర్థం.

కాని మానవస్వభావంలో నాటికీ నేటికీ ఏమాత్రం మార్పు లేదని నా విశ్వాసం. రాముణ్ణి అడవులకు వెళ్ల వలసిందిగా ఆజ్ఞాపించింది కైక. ఆ మాటలు అగ్గిగుండ్ల వలె కురిశాయి లక్ష్మణునిమీద. అతని రక్తం ఉడుకెత్తింది. కోపం పొంగింది. అతనిలో ఉన్న సంస్కారం నశించింది.

"ప్రోత్సాహితోఽయం కైకేయ్యా
సదుష్టో యదినః పితా
అమిత్రభూతో నిస్సఙ్గం
వధ్యతాం బధ్యతా మపి,"

"మన తండ్రియైన దశరథుడు కైకచే ప్రోత్సహించబడినవాడై శత్రువువంటివాడైనాడు. కాన అతనిని చంపుదము. లేదా బంధింతము."

అంటున్నాడు. ఆ పరిస్థితుల్లో మనం ఉన్నా అదే మాట అంటాం.

రావణుడు సీతను హరించాడు. సీత పర్ణశాలలో కనిపించలేదు రామునికి. అతనిపై పిడుగు పడినట్లైంది. దుఃఖం ముంచుకొని వచ్చింది. చెట్లుతోనూ, గుట్టతోనూ చెప్పుకొని ఏడ్చాడు. కోపం ముంచుకొని వచ్చింది. సూర్య చంద్రాదుల్ను స్తంభింపచేస్తానన్నాడు. కొండలను పిండి చేస్తానన్నాడు. జలాశయాల్ను ఇంకింపజేస్తా నన్నాడు. లతాగుల్మాదుల్ను ధ్వంసం చేస్తానన్నాడు.

వాటన్నింటినీ ధ్వంసం చేస్తే అతనికి ఏంలాభం? సీత లభిస్తుందా? అంటే లాభమూలేదు, సీత లభించనూ

లభించదు. కాని కోపం వచ్చినప్పుడు మనిషి అవన్నీ ఆలోచించలేడు. ఆ పరిస్థితుల్లో మనమూ అలాగే చేస్తాం. తుస్సుమంటే కోపం వచ్చే లక్ష్మణుడు అతణ్ణి శాంత పర్చాల్సి వచ్చింది.

సీతకోసం గాను రావణుణ్ణి వధించాడు రాముడు. తీరా ఆమె ఎదుటికి వస్తే-

"ప్రాప్త చారిత్ర సందేహా మమప్రతి ముఖేస్థితా
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మేదృఢమ్"

"సదాచార విషయంలో సందేహం కలిగినపుడు నా ఎదుట నిలిచి ఉన్న నీవు నేత్రకరోగికి దీపంలా ప్రతికూలమై యున్నావు" అంటున్నాడు.

చాలకాలం పరుని ఇంట్లో ఉండి మళ్ళీ భార్య లభిస్తే ఏ మానవునికైనా ఏనాడైనా అలాంటి భావమే కలుగుతుంది.

ఒకడు నన్ను నిష్కారణంగా కొట్టినప్పుడో, నా ఆస్తి అపహరించినప్పుడో—నేను ఇవాళ ఎలా feel అవుతానో అన్ని కాలాల్లోనూ వ్యక్తులు అలాగే feel అవుతారు.

కాబట్టి వాస్తవమైన జీవితాన్ని, మానవ స్వభావాన్ని చిత్రించిన రచన అజరామరం అయి అన్ని కాలాలవారికీ అన్ని జాతులవారికీ ఉపాదేయం అవుతుంది. ఎంచాతంటె అది చదువుతుంటే మన జీవితాన్ని గూర్చి చదువుతూ ఉన్నట్లే ఉంటుంది. అయిదువేల సంవ

త్సరాల క్రితపు రచన నేడెంత నిత్య నూతనంగా ఉందో నేటి రచనా మరో అయిదువేల సంవత్సరాల తరువాత అంత నిత్య నూతనంగానూ ఉంటుంది. అందుకు పరతు ఏమంటె రచనలో పస కావాలి.

> "Even Gods must die
> But soverign Poetry
> Remains
> Stronger than death."

కోట్ల సంవత్సరాల మానవ చరిత్రలో మనిషి మారలేదా ? అంటే నైతికంగా అతడు ఎంతో అభివృద్ధి చెందాడు. మానవుని నైతికంగా అభివృద్ధి చెందించడం, అతని నాగరికతను పెంచడం అంత తేలిక కాదు. ఒక చిన్న విషయం మనవి చేస్తాను. రష్యాలోనో అమెరికా లోనో ఏ కొద్దిమంది సైంటిస్టుల పరిశ్రమవల్లనో రాకెట్లు కనుగొనబడినాయి. ఆ రెండు దేశాల్లో ఏ దేశానికి చెందినవారో ఒకరు త్వరలోనే చంద్రుని చేరుకుంటారని ఆశిద్దాం. నేడు మనం విమానంలో ప్రయాణం చేసినట్లు చంద్రుని చేరే రోజు రావచ్చు. అలాంటప్పుడు ఆ రాకె ట్లతో ఏమాత్రం పరిచయంలేని మనలాంటివాళ్ళు సైతం కర్చు భరించే స్తోమత ఉంటే, చంద్రుణ్ణి చేరవచ్చు. మనవి చేయదలచిం దేమంటే ఏ కొద్దిమంది పరిశ్రమవల్లనో మొత్తం మానవజాతి నాగరికతను మార్చగల్గుతాం. కాని మానవుని నైతికస్థాయిని అంత తేలిగ్గా పెంచలేం. మానవునికి నేడు అనేక బంధాలున్నాయి. అందువల్ల

అతని కోర్కె కార్యరూపం దాల్చడానికి వీలు లేక పోతున్నది.

ఆబంధాల్ని త్రెంచుకున్నవాడు నేరంచేసినవాడు అవుతాడు. శిక్ష అనుభవించాల్సి వస్తుంది. కాని ప్రభువులూ, ప్రభుత్వాలూ ఆ బంధాల్ని తెంచుకొని మారణహోమాలు చేసినా అడిగే నాధుడు లేడు.

'మృత్పిణ్డో జలరేఖయా వలయిత
స్సర్వోఽప్యయం న న్వణుః
స్వాంశీ కృత్య సపవ సం యుగ
శతై రాజ్ఞాం గణై ర్భుజ్యతే

(భర్తృహరి)

ఈ మట్టి ముద్దకోసం మారణహోమాలు కలకాలంగా సాగుతున్నాయి. అమాయకులు లక్షలుగా ఈ రాజ్య తృష్ణకు గురిఅవుతున్నారు. అయినా యుద్ధాలు లేని కాలమూ, శాంతి వర్ధిల్లె కాలమూ వస్తుందని మానవుడు మొదటనుంచీ కలలు కంటున్నాడు. ప్రపంచం అంతటా ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏర్పడ్తే యుద్ధాలు ఉండవు అనుకున్నాడు పాపం. కాని అతని కోర్కె మరీచిక అయింది. ప్రజాస్వామ్య రాజ్యాలే ప్రజాస్వామ్యం పేరుతోనే ప్రజా స్వామ్య రాజ్యాల్ని మింగుతుండడం మనకు తెలియని విషయం కాదు. ఈ మధ్య మరొక వాదం బయలుదేరింది. ప్రపంచం మొత్తంలోనూ కమ్యూనిస్టు రాజ్యాలు ఏర్పడితే యుద్ధాలు ఉండవని. రెండు కమ్యూ

నిష్టు రాజ్యాలు కయ్యానికి కాలుదువ్వుతూ ఉండడం మనం చూస్తూనే ఉన్నాం.

యుద్ధాలు శాంతిని భంగం చేస్తాయి. మానవుడు నిర్మించుకున్న ఆశాసౌధాల్ని కూల్చివేస్తాయి. నాశనం తెచ్చి పెడ్తాయి. ఈ విషయం అందరికీ తెలుసు. అయినా యుద్ధాలు వస్తాయి. నాశనం తెస్తాయి.

అప్పుడు సాహిత్యం ఏమి అవుతుంది ? కవులు ఏంచేస్తారు ? సాహిత్యం తన నియమాల్ని ధిక్కరిస్తుంది. కవులు బంధాల్ని తెంపుకొని హుంకరిస్తారు. అప్పుడు వారికి ఆలోచించె సమయం ఉండదు. జీవితంలోని విలువల్ని గురించి గాని సాహిత్యపు ఔన్నత్యాన్ని గురించిగాని వారు ఆలోచించలేరు. ఉద్రేకంతో గేయాలు రాస్తారు, పాటలు పాడ్తారు, పద్యాలు అల్లుతారు. అప్పుడు వారు చేసే పని తమ ఉద్రేకాన్ని బయలుపర్చి, తద్వారా జనులను ఉద్రిక్తుల్ని చేయడం మాత్రమే.

గత 1962 అక్టోబరులో మన పొరుగుదేశం అయిన చైనా మిత్రద్రోహం చేసింది. అమాంతంగా, అమానుషంగా మన దేశం మీదికి మిడితల దండులా సైన్యాన్ని ఉరికించింది. ఈ వార్త అగ్గిలా ప్రాకిపోయింది.

*"గిరి మేల్కొన్నది, పురి మేల్కొన్నది*
*గిరి గుహలో కేసరి మేల్కొన్నది*
*గిరి, పుర వనముల ధర మేల్కొన్నది*
*నర, నారీ సంతతి మేల్కొన్నది."*

జాతి భేదాలు అంతం అయినాయి.
రాష్ట్రాలూ, వాని హద్దులు చెరిగిపోయాయి.
భాషా భేషజం మాయం అయింది.
ప్రాంతీయ వాదం పరుగు తీసింది.
ఒక మహా చైతన్యం ఆవిర్భవించింది.
ఒక విప్లవ జ్వాల జ్వలించింది.
ఒక మహోద్యమం పెల్లుబికింది.
ఒక అగ్గి కొండ బ్రద్ద లైంది.

శాంతిని కోరి, శాంతికోరకై నిర్విరామంగా కృషి జేసిన మన దేశం దెబ్బతిన్న బెబ్బులివలె రణరంగానికి ఉరికింది.

భారతవీరసైనికులు మంచుకొండల్లో ప్రాణాలను లెక్కచేయక ప్రళయరుద్రులవలె పోరాడారు. కైలాసం మీద ఉన్న ఒక్క ముక్కంటి కాదు. వేలమంది రుద్రులు హిమగిరిందృము మీద వెలిశారు.

యువకులు మేమంటె మేమని తాము పుట్టిన గడ్డను, రక్షించుకోవడానికి, ప్రాణాల్ను బలి ఇవ్వడానికి గుంపులు గుంపులుగా సిద్ధం అయినారు.

ఫ్యాక్టరీల్లో కార్మికులు రేయింబవళ్ళు పనిచేశారు.
సంపన్నులు సంపత్తు నర్పించారు.
నారీమణులు మంగళసూత్రాలు ఒలిచి ఇచ్చారు.
కర్షకులు కండలు కరిగించి పంటలు పండించారు.

కవుల గుండెల్లో వేల రణభేరులు మ్రోగాయి.
వారి హృదయ కుహరాల్లో అగ్ని పర్వతాలు బ్రద్దలైనాయి.
ప్రణయకవిత్వం పాడేవారు సహితం ప్రళయ కవిత్వం పాడారు.
జాతిని మేల్కొల్పారు.
యుద్ధానికి పురికొల్పారు.

వారి క్రాంతి గీతాలు అక్కడక్కడా పత్రికల్లో వచ్చి అంతరించి పోవడం మాకు ఇష్టం లేదు. ఆ అగ్ని అంతరించడానికి వీలు లేదు. ఈ రణభేరీ నాదం నిలిచిపోవడానికి వీలు లేదు.

అందుకే తెలుగు కవి జోదుల క్రాంతిగీతాల్ని చేర్చి "రణభేరి" సమర కవితా సంకలనం ప్రచురించాలని సంకల్పించాం.

ఉద్రేకం వచ్చినప్పుడు మాత్రమే కవి అగ్ని కురిపించగలడనే మాట వాస్తవం కాకపోయినప్పటికీ ఆ మహోత్తేజంలో కవికుమారులు కురిపించిన కవితా శతఘ్నుల్నే కూర్చాలని సంకల్పించాం.

ఆ ఉద్దేశంతోనే ప్రముఖ తెలుగుపత్రిక లన్నింటి నుండీ రచనలు సేకరించాం. అలా సేకరిస్తున్నప్పుడు మా దృష్టికి వచ్చిన కొన్ని అంశాల్ని నివేదిస్తాను.

1. ఎక్కువ రచనలు "ఆంధ్రపత్రిక", "ఆంధ్రప్రదేశ్" పత్రికల్లో వచ్చాయి.

2. అతివలు వ్రాసినవి బహుకొద్ది.

3. "భారతి"లో ఒక్క పద్యమూ రాలేదు.

4. అనేక నవరచయితలు చక్కని గేయాలు వ్రాశారు.

అట్టి రచనలను "రణభేరి"లో చేర్చడానికి అనుమతి నివ్వవలసిందిగా సుమారు 125 మంది కవులను కోరాం. చాలామంది సకాలానికి తమ రచనలు చేర్చుకోవడానికి అనుమతి నిచ్చారు. కొందరు క్రొత్తరచనలు చేసి పంపారు. కొందరు మమ్మల్ని ప్రోత్సహిస్తూ లేఖలు వ్రాశారు.

రచయితల, చిత్రకారుల జాతీయ రక్షణ సంఘా ధ్యక్షులు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు, శ్రీ అరిపిరాల విశ్వంగారి సహాయంతో కొన్ని రచనలు సేకరించారు. వాటన్నింటినీ వారు మాకు అందించారు. వాటిలో కొన్నింటిని ఇందులో చేర్చాం.

సమర సాహిత్యాన్ని గూర్చి సమర విజయం అనే చక్కని వ్యాసం వ్రాసి ఇచ్చారు డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రిగారు.

చైనా దండయాత్రను గురించి ఆంధ్రజనత సంపాదకులు శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఒక చక్కని వ్యాసం వ్రాసి ఇచ్చారు.

ప్రఖ్యాతశిల్పి శ్రీ జిలానీగారు 'Fare wel my heart' అనే శిల్పాన్ని రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్‌కు సమర్పించారు. దాని ఛాయాచిత్రం ప్రచురిస్తామనగానే వారు దయతో అంగీకరించారు.

అందమైన ముఖచిత్రం చిత్రించారు శ్రీ మడిపడిగ బలరామాచార్యులవారు.

ఇంత అందంగా ముద్రించి ప్రచురిస్తున్నారు శ్రీ చందా రాజేశ్వరరావుగారు.

నాకు సర్వవిధాల సహకరించారు శ్రీ అల్లాడి పెంటయ్యగారు.

వారందరికీ నా హార్దిక కృతజ్ఞతలు.

ప్రచురించ దలచుకున్న రచనలన్నింటినీ కవుల పేర్లనుబట్టి అకారాదిక్రమంగా కూర్చాం.

అలా కూర్చడం పూర్తి అయింతర్వాత ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు కొందరు ప్రముఖకవుల రచనలు ఇచ్చి వానిని సహితం సంకలనంలో చేర్చవలసిందని తమ అమూల్యమైన సలహా ఇచ్చారు. వారికి ఎంతో కృతజ్ఞుణ్ణి. వాటిని తిరిగి అకారాదిక్రమంగానే చివర చేర్చాం.

వచన కవిత్వం, పద్యం, గేయం, పాట అనే భేదాలు పాటించబడలేదు. అన్ని ప్రక్రియలూ పరిగ్రాహ్యములే అని భావించాం.

పుస్తకం చివర రచయితలకు సంబంధించిన వివరాలు ఇచ్చాం. అందినవరకు రచయితల ఫొటోలుకూడా ప్రచురించాం.

ఇలా, అన్నివర్గాల, అన్ని ప్రక్రియల కవుల కవితలకు ప్రాతినిధ్యం వహించే సమరకవితా సంకలనం ప్రచురించాం. ఈ సంకలనం తెలుగువారి మన్నలకు పాత్రం అవుతుందని మాకు విశ్వాసం ఉంది.

త్వరలోనే మలిముద్రణ వేయడానికి ఆంధ్రప్రజానీకం మమ్మల్ని ప్రోత్సహిస్తుందని ఆశిస్తున్న —

10-1-688,<br>నెహ్రూనగర్.<br>సికింద్రాబాదు.

భవదీయుడు,<br>దాశరథి రంగాచార్యం.

—(o)—



కీ॥ శే॥ చందా నారాయణ శ్రేష్ఠిగారు

సికింద్రాబాదు.

# ప్రకాశకీయం

చైనాముష్కరులు పవిత్రభారతావనిని కబళించడానికి దండెత్తారు. నలభై కోట్ల ప్రజానీకం ఒక్కవ్యక్తివలె గర్జించింది. మన వీరసైనికులు ఎముకలు కొరికే చలిలో, మంచుకొండలపై నిల్చి శత్రువులను ఎదిరించారు. ఆ తరుణంలో ఎవరికి వారు శక్తివంచన లేకుండా దేశరక్షణకు తోడ్పడ్డారు.

కవుల రక్తం పొంగింది. వారు నిప్పులు కురిపించే పద్యాలు రచించారు. వాటిని ప్రచురించడం ప్రకాశకులపని. దండయాత్ర ప్రారంభం అయిన కొద్దిరోజులకే మేము రెండు గేయసంకలనాల్ని ప్రచురించాం. అందు "చైనాదురాక్రమణ గేయాలు" అను శ్రీ బూరెల సత్యనారాయణమూర్తిగారి గేయసంపుటి మొదటిది.

హైద్రాబాదులోను, ఆంధ్రప్రదేశంలోని మరికొన్ని ముఖ్యపట్టణాల్లోను జరిగిన "సినీతారల ఉత్సవాల"లో మా చైనాదురాక్రమణ గేయాల్ని ప్రఖ్యాత

2)

సినీగాయకులు, శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు గారు గానం చేశారు; ప్రజలలో దేశభక్తిని రేకెత్తించారు.

"ఖబర్దార్ చైనా" అనేపేరుతో "దాశరథి" "మడిపడిగ బలరామాచార్యుల వారు" రచించిన గేయాల్ని ప్రచురించాం. ఇది రెండవది.

ఆంధ్రప్రదేశంలోని ప్రముఖకవులు రచించిన "సమరగేయాల సంకలనం" ప్రచురించాలని సంకల్పించి, అట్టిసంకలనానికి రచనలు సంపాదించి పెట్టవలసిందిగా శ్రీ దాశరథి రంగాచార్యుల వారిని కోరాం. వారు మా కోర్కెను మన్నించి, అత్యంత ఉత్సాహంతో రచనలు సేకరించి, వాటిని "రణభేరి" సంకలనంగా కూర్చి ఇచ్చారు.

"రణభేరి"ని ఆవిష్కరించడానికి అంగీకరించారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్, నీలం సంజీవరెడ్డిగారు.

ఆవిష్కరణోత్సవానికి అధ్యక్షత వహించడానికి అంగీకరించారు పరిశ్రమల శాఖామాత్యులు డా॥ M. N. లక్ష్మీనర్సయ్యగారు.

మా విన్నపం మేరకు తమ రచనల్ని ప్రచురించుకోవడానికి పలువురు కవులు సమ్మతించారు.

అందమైన ముఖచిత్రాన్ని చిత్రించి ఇచ్చారు శ్రీ మడిపడిగ బలరామాచార్యులవారు.

మా కృషికి అన్నివిధాలా సహకరించారు హైద్రాబాదునగరపాలక సభ్యులు శ్రీ అల్లాడి పెంటయ్యగారు.

వారందరికి మా హృదయపూర్వక నమోవాకములు.

వారి కృషి ఫలితంగా మేము ఈ "రణభేరి"ని ప్రచురించగలిగాం; మీకు అందించగలుగు తున్నాం. ఈ సంకలనం సకలాంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరగొనాలని మా కోర్కె. అందుకు మీ ప్రోత్సాహం లభిస్తుందని ఆశిస్తున్నాం.

— ప్రకాశకులు.

# సమర విజయము

*"పగ యడఁగించు టెంతయు శుభంబు. అది లెస్స—*
*అడంగునే పగం బగ—?*
*పగ గొన్న మార్కొనక పల్కక యుండవచ్చునే—?"*

*—తిక్కన.*

యుగములబడి భారత రాజనీతి పై మూడు వాక్యముల పరమార్థమును చుట్టుకొనియున్నది. మన కెవ్వడును పగవాడని లేకుండుట మన పద్ధతి. మన యాపద్ధతి చాల లెస్సపద్ధతి. మన కెవ్వరును పగవారు లేరు. అది మన దృష్టి లక్షణము. తద్భిన్నదృష్టి లక్షణలక్షితమైన జాతి యొకటున్నచో దానికి మనము పగవారము కావచ్చును. మనల నది పగవారుగా భావించుచున్నదని మనమును దాని నట్లే అనుకొనవలయునా? మన మనుకొనకపోవచ్చును. మనల నట్లనుకొని మనమీదకు వచ్చునట్టి యా జాతిని మనము ఎదుర్కొనకుండ నోరుమూసికొని యూరకొనవచ్చునా మరి?— ఇది చాల చిత్రముగా నున్నది. మనకు శత్రువులు లేరు. మనయందు శత్రుభావమును పెంచుకొన్నవా రున్నారు. మనకు యుద్ధముతో పని లేదు. మనమీద యుద్ధము ప్రకటించువారున్నారు. అపుడు మనము వారిని ఎదుర్కొననే వలయునుకదా? కనుక మనకు యుద్ధముతో పని లేనట్లా? ఉన్నట్లా? పారమార్థికముగా లేదు. వ్యావహారికముగా నున్నది.— ఇది ద్వాపరయుగాంతమున ఢిల్లీ రాజధానిగా

భారతదేశమును పాలించిన యుధిష్ఠిర చక్రవర్తి వెలయించిన రాజనీతి. నేడును అదియే మన రాజనీతి. కాలముమీద వచ్చిన మార్పు ననుబట్టి నామరూపములలో మార్పులు వచ్చిన రావచ్చును. ఆంతర్యముమాత్రము సంపూర్ణముగా నదియే.

చైనాతో మనకు శత్రుత్వములేదు. ఆ లెక్కను మన కెవరితోడనులేదు. చైనామాత్రము మనతో శత్రుత్వము పెట్టుకొన్నది. పెట్టుకొన్నదనగా మనల నది వ్యావహారికముగా యుద్ధమునకు దింపినది. దానిమాట వదలినచో మనము యుద్ధవాతావరణములో నున్నాము.

ఉదాత్తమైన మతతాత్త్విక దృక్పథముగల జాతి యుద్ధవాతావరణములో మనలేదు. భారతదేశపు మత తాత్త్వికపు టుదాత్తతను కేవలయుద్ధముగా గాక దాని నొక కళగా సంభావించి తదనుభవవిశేషమువలన పరమోత్సాహభరితమై శత్రునాశనము చేసికొనుటను నేర్చుకొన్నది. యుద్ధము కళగా సంభావింపబడిన తరువాత దానిపేరు వీరము. అది రసము. అది అనుభవయోగ్యము. తదనుభవస్థాయి ఉత్సాహము. ఉత్సాహము కర్మకు మూలము, యుద్ధమును కళగా మార్చుటలో మన ప్రాచీనుల ఆంతర్యము మరొక్కటున్నది. సర్వమానవ చిత్తవృత్తులను తమ తమ పరిధిలలో కళానుభవసమర్థములు, అందువలన యుద్ధవాతావరణములో చిక్కుకొన్న దేశీయుల చిత్తమును రసానుభూతిని కలిగించుట ద్వారా ఉత్సాహపూరితములుగా చేసి శత్రుంజయ కర్మకు సన్నద్ధము చేయుట యది.

కళలలో శ్రేష్ఠమైనది కవిత్వము. యుద్ధమును కళగా సంభావించినారనగా కవితమయము చేసినారని యర్థము. యుద్ధవాతావరణమును కవిత్వముగా మార్చి చూపిన గౌరవ మీ దేశమున వైదికకవులది.

Go forward and Conquer, ye heroes!
May God give you protection.
Valiant be your arms, so that you
May remain unwounded.

ఇది ఋగ్వేదమునందున్నది. చిత్ర మేమనగా నీ యాంగ్లము నకు గల మూలము నాల్గువేదములయందును నున్నది. శత్రుంజయ కర్మపరతను వేదము లేకకంఠమున ప్రబోధించుచున్నవి. వైదిక నాగరికతలో వీరరస ప్రపంచనము విలక్షణమైనది. పై వాక్యములు విజయలక్ష్మిని గొనిరాసాగు సైనికవీరుల నుత్సాహపరచి ప్రేరేపించునవి. పరమేశ్వరుని శక్తియొక్క ఆనుకూల్యమువల్లనే మానవుడు జయించుకొని వచ్చుచున్నాడు. అందువల్లనే ఆ వాక్యములలో భగవత్ప్రసక్తి తేబడినది. నాల్గు వేదములయందును గలదు కావున ఇది ఉదాహరింపబడినది. ఇట్టి తాత్పర్యముగల వాక్యములు- పద్యములు- వైదిక వాఙ్మయమున పుష్కలముగా నున్నవి. ఇంద్రుడు మహావీరుడుగా అందు స్తుతింపబడినాడు. ఆయనను ఆదర్శముగా చేసి వీరము ఆ వాఙ్మయమున ప్రబోధింపఁబడినది.

O Hero! give manly vigour to our men
So Thou Hero! urge us to heroic power
Thou art Conquering Power, give us
Conquering Power
May we be slayers when we war.

ఇట్టి ప్రార్థనలు ఋగ్వేదమునిండ గలవు. కర్మయోగులైన మహర్షులయొక్క శత్రుంజయ రూప చిత్తవృత్తి వైదిక వాఙ్మయమున పరుచుకొనియున్నది.

భారతదేశమున తరువాత వెలసిన లౌకిక వాఙ్మయము లన్నియు పరమార్థము విషయమున నా వైదిక వాఙ్మయమునే ఆదర్శముగా నిడుకొన్నవి. దేశీయమైన సంస్కృతీ సంప్రదాయము

లను దెబ్బతీయు దండయాత్రలు జరిగినప్పుడెల్లను వానిని తీవ్రముగా నెదుర్కొనుటకు దేశీయులను ప్రోత్సాహపరచు కవిత్వములు వెలయుచునేయున్నవి. దేశీయులవలన కాదనిపించినపుడు వారిని శత్రువుల బారినుండి రక్షించుటకు పరమేశ్వరుడు ప్రార్థింపబడినాడు. దుష్టశిక్షణ - శిష్టరక్షణ రెండును పరమేశ్వర కృత్యములు గాన ఆపత్సమయములందట్టి ప్రార్థనలు జరిగినవి. పరమేశ్వరుడును దయాంతరంగుడై అనుకూలించినట్లు నిదర్శనము లున్నవి.

గోగులపాటి కూర్మనాథకవి యను నాతడు సింహాద్రి నారసింహ శతకము వ్రాసినాడు. విశాఖపట్టణముజిల్లాలోని సింహాచల క్షేత్రమందలి నరసింహస్వామి నుద్దేశించి చెప్పబడిన శతక మది. యవనుల దండయాత్ర ఆ ప్రాంతమున మొదలైనది. దేశీయు లా దండయాత్రవలన పడరానిపాట్లు బడినారు. యవనుల నెదుర్కొని సర్వనాశనము చేయగలిగిన స్థితి దేశీయులకు లేనికాలమది. ఆ మహాఘోరము కూర్మనాథకవికి భరించుట కష్టమైనది. అయన తానొక్క డేమి చేయగలడు? మానవుని చేయిదాటిన పనికి పరమేశ్వరుడేగదా దిక్కు? యవనులు నెట్టుకొని వచ్చుచున్నారు. కూర్మనాథకవి సింహాచల మెక్కి నృసింహుని ఎదురుగా నిలబడి "వైరిహర రంహా! సింహాద్రి నారసింహా" అను మకుటముతో సీస పద్యములను చెప్ప మొదలుపెట్టినాడు. ఆ చెప్పుటలో కూర్మనాథ కవి యవనులు చేయు ఘోరకృత్యముల నుగ్గడించినాడు. దేశీయులు పడు పాట్లు వివరించినాడు. ఇంత మహాఘోరము జరుగుచున్నను నీవు చలింపవేమని స్వామిని దూషించినాడు. ఇట్లరువది యెనిమిది పద్యములైనవి. అపుడు శ్రీ నరసింహస్వామి తుమ్మెదల దండు రూపమున యవనులను చుట్టుముట్టి వారి కూపిరి మెసలనీయక బాధించి వెంటబడి తరిమి కొట్టినాడట. విశాఖపట్టణమువద్ద గల "తుమ్మెదల మెట్ట" ఆ స్వామి లీలకు గుర్తుగా నేటికిని నిలచి యున్నది. అరువదితొమ్మిదవ పద్యమునుండి తన ప్రార్థన మన్నిం

చిన దేవుని స్తుతించినాడు.— కూర్మనాథకవివలెనే నిమ్మల లక్ష్మణ కవి యను నాతడును మొగలు దండయాత్రలవలన దేశ ప్రజలకు కలిగిన ఇక్కట్లను పేర్కొని తదాపదనుండి దేశమును రక్షింపవలసి నదిగా కంచి యేకామ్రలింగస్వామిని ప్రార్థించినాడు. — ఔరంగ జేబు దండయాత్రలనుండి దేశమును రక్షింపవలసినదిగా నొక కవి తిరుపతి వేంకటేశ్వరస్వామి నుద్దేశించి "శత్రుసంహార! వేంకటాచల విహార" అను మకుటముతో నొక శతకమును చెప్పెను. ఈ కవి పేరు తెలియనట్లే ఆ శతకముకూడ పూర్తిగా లభింపలేదు.

శ్రీకృష్ణ దేవరాయలవారు యుద్ధములకు పోవుచు పెద్దన్న గారిని వెంటపెట్టుకొని పోయెడివారని వినుచున్నాము. మనకు లభింపలేదుగాని సైనికవీరులను ప్రోత్సహించు కవిత్వ మాయన అల్లెడివాడు కావలయును.

దేశమున ఏ అల్లకల్లోలము వచ్చినను సహింపజాలక ఎదురు తిరిగి దానిని నణచి శాంతి సౌఖ్యములను నిలబెట్ట తహతహపడు కవి జాతి, దేశము అన్యులచేత ఆక్రమింపబడు చుండుటను సహించి యూరకొనునామరి ? ఆ యూరకొనకపోవుటయే వీర రసమును కవిత్వ రూపమున వెలయించుట.

ఈ యుద్ధవీర రస కావ్యరచన రెండు విధములుగా నున్నది. యుద్ధకాల మందలి రచన యొకటి. యుద్ధకాలానంతర మందలి రచన మరొకటి. యుద్ధకాలమందు వెలసిన కావ్యములయందు దేశీయుల కా యుద్ధముయొక్క అనివార్య లక్షణము నెరిగించుట, శత్రుదేశపు టనాగరక ప్రవృత్తిని ప్రపంచించి చూపుట, శత్రు కృతములు ఘోరకృత్యములను చిత్రించుట, స్వసైనికుల వీర విజృం భణమును కీర్తించుట, విజయలక్ష్మి కరగ్రహణ ముహూర్తము మన కత్యంతము సమీపముగా వచ్చుచున్నదని దేశీయుల కుత్సా హము కలిగించి అవసరము వచ్చినచో ప్రతి పౌరుడును సైనికుడుగా

ముందుకు సాగుటకు సన్నద్ధము చేసిపెట్టు ప్రయోజనము నుద్దేశించి చేయబడును. యుద్ధానంతర కాలమందు వెలసిన రచన లిట్లుండవు. అవి శాంతికాలములో వచ్చినవికదా ! అప్పుడు కవులు ఉచితానుచితములను లెక్కగట్టి బేరీజువేసి యుద్ధవీరమును గురించి మాటాడుదురు. రెండు ప్రపంచయుద్ధములలో అత్యంతము ప్రముఖపాత్ర వహించిన ఇంగ్లాండుదేశమున యుద్ధానంతర కాలమున వచ్చిన రచనలా విషయమున ప్రముఖములైనవి. మనదేశము మొత్తము కలిసి శత్రువు నెదుర్కొని సమర మొనర్చిన దినములు మనకు తెలియరాకుండ పోయినవి. భారతదేశ చరిత్రలో నిప్పటి ఈ చైనాతో తప్పనిసరిగా చేయవలసి వచ్చిన యుద్ధమే యుద్ధము. ఈనాడు భారతదేశమంతయు శత్రుంజయమును సంభావించుచున్నది. దేశీయుల ఈ శత్రుంజయ సంభావనము కవులచేత వ్యక్తీకరింపబడినది. కవు లెప్పుడును తమ తమ దేశప్రజల పరమోత్తాలమైన భావోద్వృత్తికి రూపకల్పన చేయుచుందురు. అట్లు కల్పింపబడిన రూపము నామమే *రణభేరి.*

ఈ రణభేరి ఎట్టిదనగా యుధిష్ఠిర చక్రవర్తి శంఖము వంటిది. యుధిష్ఠిర శంఖ మెట్టిది? ఒక్క లక్షభూసురులు తృప్తిగా భోజనము చేసిన పిదప తనకు తానుగా మ్రోయునది. అట్టి శంఖ మా చక్రవర్తి చేసిన రాజసూయ యజ్ఞకాలమున నొక్క నిమిషమేని నుడుగక మ్రోగినది. ఆ భారతదేశ ప్రభువట్లు చేసినా డా యజ్ఞమును. ధర్మసమర మొక యజ్ఞముగా భారతమున నిరూపింపబడినది. అట్టి సమరయజ్ఞమునందు మ్రోయు శంఖము పేరు *రణభేరి.* ఈ యజ్ఞము సుప్రయోగముగా విజయఫల పర్యవసితమగువరకు ఈ రణభేరి మ్రోగుచునే యుండును. ఈ మ్రోత భారతదేశపు భాషాకవులచేత అక్షరరూపమున తద్భాషాభాషీయుల కర్ణమూలముల నినదింప జేయబడుచున్నది. భారతదేశపు టాంధ్రభాషా

కవులు చిన్న - పెద్ద అని లేకుండ సర్వులును ఆ బాధ్యతను స్వీకరించి చేసిరి. అట్లు చేసిన కవులచేత నొకచో చేర్చి చేసినదీ "రణ భేరి".

ఇందు 71 కవుల రచనలున్నవి. ఇవన్నియు దేశమునందలి వివిధ పత్రికలలో చాలవరకు అప్పుడప్పుడు ప్రచురింపబడినవే. కొన్ని ప్రచురింపబడనివియు గలవు. ఇందరు కవుల రచనల నొకచో చేర్చి ప్రచురింపవలయునన్న ఊహపుట్టిన ప్రచురణకర్తలును–వివిధ పత్రికలనుండి రచనలను సేకరించి - క్రొత్తవి వ్రాసి తెప్పించి ఇంత సక్రమముగా సమకూర్చిన సంపాదకులును "నేనుసైతం–నేను సైతం" అని బాధ్యత నిట్లు బుజములమీద వేసికొన్నట్లు కన్పించుచున్నారు.

ఈ సంపుటమునందు వివిధ ప్రకారములైన రచనలు ఉన్నవి. చైనా కమ్యూనిజము యొక్క వికృతరూపమును చిత్రించునవి కొన్ని – చైనా చేసిన మిత్రద్రోహమును పేర్కొనునవి కొన్ని – శత్రువుల నెదుర్కొని హతమార్చుటకు దేశీయులను హెచ్చరించి ప్రోత్సహించునవి కొన్ని – యుద్ధరంగమున విజృంభించి శత్రువులను చీల్చి చెండాడిన మహావీరులైన సైనికులను కీర్తించునవి కొన్ని – అనేక కష్టములకోర్చి సంపాదించుకొన్న స్వాతంత్ర్యమును శత్రు సంహారము చేసి నిలబెట్టుకొననే వలయునన్న నిశ్చయభావ ప్రబోధకములు కొన్ని – సైనికులను ప్రోత్సహించునవి కొన్ని – సైనికులకు వలయు సహాయసంపదను చూపునవి కొన్ని – ఇట్లిందున్న రచనలు వివిధ ప్రకారములు విషయమునుబట్టి ఇట్లున్నవి. పద్యములు - గేయములు - వచన పద్యములు - ఇత్యాది నామరూపములనుబట్టియు నిందలి రచనలు వివిధ ప్రకారములైయున్నవి. ఇట్లు స్థూలదృష్టికి కనిపించినను - సూక్ష్మముగా విచారించినచో ఈ సర్వాంధ్రకవుల అంతర్యములందును అవినాభావ సంబంధముగల రెండు పదార్థములు తిష్ఠవేసికొని కూర్చొన్నవి. ఈ కవుల ఊహాశక్తికి బీజభూతములవ్వి. హిమాలయపర్వత మొకటి. పరమశివు డొకడు. సంస్కృత భాషయందు కాళిదాసు, ఆంధ్రభాషయందు

నన్నిచోడదేవుడు - అవినాభావసంబంధము గల ఆ వస్తుద్వయమును లెస్సగా పండించినారు. వాని కర్మకాలి చైనావాఁడా వస్తుద్వయము నతిక్రమించియే వచ్చుట కాయత్తుడైనాడు. వానికి మరి మార్గాంతరము లేదు. వాఁడేమార్గమున దురాక్రమణకు సాగి అడుగిడినాఁడో ఆ మార్గము సర్వభారతజాతికిని పరమపవిత్రమైన మహాకవిత్వ భిక్ష పెట్టినదైనది. చైనా భారతదేశముమీదకు యుద్ధమునకు వచ్చు చున్న దనగనే-కొన్నివేల సంవత్సరములుగా జీర్ణించుకొని పోయిన నరనరములయందలి పరమోత్తాలమైన కవితావేశము సర్వభారత కవిజనముఖముగా త్రవ్వుకొని వచ్చినది.

ఆ త్రవ్వుకొనివచ్చిన దాని స్వరూప స్వభావము లెంత తీవ్రములో ఎంత స్వచ్ఛందములో ఆంధ్రభాషాకవులు వాని నెట్లు ఆవిష్కరించిరో ఈ సంపుటమునందలి రచనలను చూచిన తెలియును. ఈ సంపుటమున కనవచ్చు మరొక వైచిత్రి యేమనగా: ఈ నవీనాంధ్రకవులు, ఎంతగా పాశ్చాత్యవాసనావాసితు లయినను, ఎంతగా ఏదో విప్లవము బహువిషయములలో తేవలయునన్న ఇచ్ఛగలవారైనను, వారి ప్రాణవాయువులయందు పారాడు భారతీయత కొట్టవచ్చినట్లు కన్పించుట. ఈ దేశమింకను కొన్ని వందల సంవత్సరములవరకు తన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయములను నిలబెట్టుకొనుచు తన అనన్య సామాన్యతను నిరూపించుకొనగలదన్న విశ్వాసమును కలిగించుట. ఆ విశ్వాసము చాలును జాతి బ్రతుకుటకు. జాతి బ్రతుకునకు మూలమైన విశ్వాసమును దిక్కులు పిక్కటిల్ల ప్రకటించిన సర్వాంధ్రకవులును అభినందనీయులు. ప్రత్యానీక విజయ శ్లాఘాభిలాషామనీషా ధురంధరులైన ఆంధ్రకవుల రసనాగ్ర నివాస రసికయగు వాగ్దేవికి విజయమంగళ మహాశ్రీలు.

*"ధర్మం బేతల ననూనమగు నిద్ధజయ*
*మాతలకు నెట్లయిన సిద్ధమగు."* — *తిక్కన.*

*సికింద్రాబాదు,*
***31-10-63.***

కేతవరపు రామకోటిశాస్త్రిం.

# కలియుగ రాక్షసులు, వారి ఎత్తుగడలు

కమ్యూనిస్టు చైనా మేకతోలు కప్పుకున్న పెద్ద పులి అనే విషయం 1962 అక్టోబర్‌లో కాని మనకు పూర్తిగా తెలియలేదు. ఆ నెల 20 వ తేదీన మన ఉత్తర సరిహద్దు పొడవునా పెద్దపెట్టున చైనాసురులు దాడులు ప్రారంభించారు. చైనా సైనికులు మారణాయుధాలతో మిడతల దండుల్లా వచ్చి ఏమరపాటుగా నున్న భారత సరిహద్దు దళాలపై విరుచుకుపడ్డారు. ఇటువంటి ఉపద్రవం ఇంతలో ముంచుకు వస్తుందని కలలోనైనా ఊహించని కారణంచేత, మన సైనికులు ప్రాణాలొడ్డి వీరోచితంగా పోరాడినప్పటికీ, మనకు కొన్ని పరాజయాలు తప్పలేదు. చైనా సేనలు దారి పొడవునా నెత్తురు తర్పణ చేసుకుంటూ లడక్‌లో చుసుల్ విమానాశ్రయంవరకు చొచ్చుకు వచ్చారు. నేఫాలో తాగ్లా, బోమ్‌డిలా మొదలైన స్థావరాలను వశపరచుకొని అస్సాం పొలిమేరలవరకు దూసుకు వచ్చారు. ఈ హత్యాకాండను ఒక నెల సాగించిన పిమ్మట, ఎంత హఠాత్తుగా దండయాత్ర ప్రారంభించారో అంత హఠాత్తుగాను దానిని నిలిపివేశారు. 1962 నవంబర్ 21 వ తేదీ అర్ధరాత్రినుంచి పోరాటాన్ని విరమి

స్తున్నట్టు, 1959 నవంబర్ 7 వ తేదీనాటి ప్రత్యక్షాధీన రేఖనుంచి 20 మైళ్ళు వెనక్కి సేనలను ఉపసంహరిస్తున్నట్టు చైనా తనకు తానై ప్రకటించింది. తన ప్రకటన మేరకు కొన్ని చర్యలు తీసుకున్నది.

తిరిగి వెళ్ళిపోదలచినవాడు అసలు ముందుకు ఎందుకు వచ్చినట్టు? వచ్చినవాడు మళ్ళీ ఎందుకు వెళ్ళిపోయాడు? ఇందులో ఇమిడిఉన్న చిదంబర రహస్యం ఏమిటి? ఇది ఇప్పటికీ రాక్షస మాయగానే ఉండిపోయింది.

కేవలం సైనిక వ్యూహాలుగానే చైనా ఈ దండయాత్ర తలపెట్టలేదనేది స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. చైనాకు మానవబలగం అమితం. 70 కోట్ల జనాభాకు తిండి, గుడ్డ పెట్టలేక చైనా పాలకులు నానా అవస్థ పడుతున్నారు. చైనాలో ఆర్థిక పరిస్థితులు నానాటికీ దిగజారి పోతున్నాయి. వారు ఎంతో ఆర్భాటంగా ప్రారంభించిన "మేటి ముందడుగు" కార్యక్రమం నీళ్ళు కారిపోయింది. కమ్యూన్ల పథకం ఇంకా గట్టిగా దెబ్బ తిన్నది. దేశంలో పెక్కుచోట్ల క్షామదేవత విలయనృత్యం చేస్తున్నది. ప్రజల్లో తీవ్ర అసంతృప్తి ప్రబలింది. అక్కడక్కడ తిరుగుబాట్లు జరిగినట్టు కూడా వార్తలు పొక్కినవి. ఒక చిన్న దండయాత్రను లేవదీస్తే ఉభయ తారకంగా ఉంటుందని చైనా కమ్యూనిస్టులు భావించి ఉండవచ్చు. ఒకవంక ప్రజల దృష్టిని మళ్ళించవచ్చు. మరొకవంక కొంతవరకు భూభారాన్ని తగ్గించవచ్చు. నిజానికి

గత సంవత్సరం జరిగిన సరిహద్దు పోరాటంలో వేలాది చైనా సైనికులు భారతవీరుల తుపాకీ గుళ్ళకు గురి అయి కాకుల్లా రాలిపోయారు. పదిమంది శత్రువులను హతమారిస్తేనే కాని భారత సైనికుడు వీరస్వర్గ మలంకరించడు.

అసూయ మానవుని గంగవెర్రి లెత్తిస్తుంది. చైనా దండయాత్రకు అసూయ ఒక ప్రబలకారణం కావచ్చు. ఆర్థికాభివృద్ధికి పార్టీ నియంతృత్వం ఉత్తమోత్తమ సాధనం అని కమ్యూనిస్టుల మూఢవిశ్వాసం. తమ దేశంలో ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలు కుంటువడి దుర్భర పరిస్థితులు ఏర్పడటం, ప్రజాస్వామిక పద్ధతిలో నడుస్తున్న భారతదేశం ప్రధాని నెహ్రూ నాయకత్వాన శరవేగంగా ఆర్థికరంగంలో పురోగమించటం చైనా కమ్యూనిస్టు నాయకులు భరించలేకపోయారు. ఒక దండయాత్ర జరిపి యుద్ధభయం పుట్టిస్తే, భారతదేశం రక్షణ వ్యయాన్ని పెంచక తప్పదని, తత్ఫలితంగా భారతదేశ ఆర్థికాభివృద్ధిని దెబ్బతీయవచ్చునని చైనా నాయకులు ఆశించారు

రాజకీయంగా చూస్తే విశేష ప్రాధాన్యం ఉన్నప్పటికీ (దాని గురించి తర్వాత ముచ్చటిస్తాను), సైనికరీత్యా చూస్తే మాత్రం, గత సంవత్సరం పరిమిత లక్ష్యంతోనే చైనా ఈ సరిహద్దు యుద్ధాన్ని ప్రారంభించిందనేది స్పష్టం కాగలదు. భారతదేశాన్ని జయించటం ఎవరితరం కాదని గ్రహించలేని అవివేకులు కారు చైనా నాయ

క్షులు. అస్సాం పొలిమేరలకు వచ్చి పలాయనం చిత్తగించ టానికి ముఖ్యకారణం ఇదే. అస్సాంలో అడుగు పెడితే, అది ప్రపంచయుద్ధంగా పరిణమించి తీరుతుందని వారు గ్రహించి ఉండాలి. ఇదీగాక, వారు ఆశించింది ఒకటైతే, జరిగింది మరొకటి. చకచక కొన్ని భారత స్థావరాలను పడగొడితే, భారతదేశం భయపడి దాసోహమంటుందని, అరాజకం ప్రబలి నెహ్రూ ప్రభుత్వం కూలిపోతుందని వారు ఆశించారు. కాని భారతదేశం ఛిన్నాభిన్నం కాలేదు సరికదా, కనీ వినీ ఎరుగని జాతీయచైతన్యం, సమైక్యత, ధర్మావేశం పెల్లుబికినవి. ప్రజలు ఒక తాటిపై నిలిచి, నెహ్రూ ప్రభుత్వానికి అండగా నిలిచారు. దేశ రక్షణకై ఎట్టి త్యాగాలకైనా వెనుదీయమని భారత ప్రజలు చాటారు. భారతదేశంలోని ప్రజావెల్లు వను చూసేసరికి, అస్సాంలో ప్రవేశిస్తే, గట్టి మొట్టి కాయలు తప్పవని వారికి స్పష్టమైపోయింది. ముందుకు వెడితే ప్రమాదం కాబట్టి, ఉన్నచోట ఉంటే, భారత సేనలు తరమటం తథ్యం కాబట్టి, వెనక్కితగ్గటం శ్రేయ స్కరమని నిశ్చయించుకున్నారు.

చైనా వారికి సామ్రాజ్యకాంక్ష, జాత్యహంకారం మెండు. తమ జాతి వంటి జాతి పృథ్విలో లేదని వల్లె మాలిన అహంభావం. పూర్వపు సామ్రాజ్యవైభవాన్ని మళ్లీ చవిచూడాలని వారికి బలమైనకోరిక కలిగింది. సుస్థిరమైన కేంద్ర ప్రభుత్వం పర్పడి దేశమంతా ఏకచ్ఛ త్రాధిపత్యం క్రిందకు వచ్చినపుడల్లా ఈ సామ్రాజ్యకాంక్ష

ప్రికోపించటం కద్దు. దానిని సమర్థించే నిరంకుశతత్వం కూడా వారికి ఉన్నది. నాటి చైనా సామ్రాజ్యం చాలా విస్తరించి ఉండేది. బర్మా, నేపాల్, వియత్నాం, కాంబోడియా, కొరియా, మలయా మొదలైన ఆసియా దేశాలు ఎన్నో ఎప్పుడో ఒకప్పుడు చైనా సామ్రాజ్యంలో అంతర్భాగాలుగా ఉన్నవే. వీటిని చైనా అంతర్భాగాలుగా చూపిస్తూ 1954లో చైనా ప్రచురించిన పటం వారి సామ్రాజ్యకాంక్షను పూర్తిగా ప్రతిబింబిస్తున్నది. ఈ విస్తృతసామ్రాజ్యాన్ని పాశ్చాత్యులు విచ్ఛిన్నం చేశారని, వారు వాటిని ఒక్కటొక్కటిగా ఆక్రమించుకొనటం వల్లనే అవి వేరై స్వతంత్రరాజ్యాలుగా మారినవని చైనా పాలకులు ఆడిపొయ్యని రోజు లేదు. అందుకే చైనాకు పశ్చిమరాజ్యాలంటే అంత అక్కసు. అవన్నీ తనకు చెందవలసిన ప్రాంతాలేనని, వాటిని వశపరచుకొనటం తమ జన్మహక్కు అనీ, అది సాధ్యం కాకపోయినా అధమపక్షం అవి తమకు సదా మోకరిల్లి ఉండాలనీ చైనా వారి ఆకాంక్ష. వీలైతే వీటిని కబళించటానికి చైనా వెనుదీయదు. కాని పాపం వీలు చిక్కటం లేదు. కనీసం మొన్న మొన్నటి వరకు చైనాలో అంతర్భాగంగా ఉన్న ఫార్మోజానైనా వారు వశపరచుకోలేకపోయారు. కోరికలు తీరనందు వల్ల, అడుగడుగునా అడ్డంకులు ఎదురవటం వల్ల ఒక విధమైన తిక్క బైల్దేరి చివరకు యుద్ధోన్మాదంగా పరిణమించింది.

చైనా సామ్రాజ్య విస్తరణకాంక్షకు మరొక కారణం ఏమిటంటే మితిమీరిన జనాభా దృష్ట్యా రాజ్య విస్తరణ అత్యంతావశ్యకమైనది. భౌగోళికంగా, చైనాను రెండు ప్రాంతాలుగా విభజించవచ్చు. పశ్చిమ ప్రాంతంలో చైనా భూభాగంలో 40 శాతం ఉన్నది. ఇది ఎడారులతో, బీడు భూములతో నిండిన ప్రాంతం. జనాభాలో నూటికి 5 వంతుల మంది మాత్రమే ఇక్కడ నివసిస్తున్నారు. అంటే రెండవ ప్రాంతంలో 67½ కోట్లమంది నివసిస్తున్నారన్నమాట. దీనినిబట్టి చైనాలో జనాభా ఒత్తిడి ఎంత విపరీతంగా ఉన్నదో ఊహించవచ్చు. ఈ ఒత్తిడిని తగ్గించి జీవన ప్రమాణాలను వృద్ధిచేయాలంటే, కొంతమందిని ఇతర ప్రాంతాలకు తరలించటం తప్పనిసరి. ఇది సాధ్యపడాలంటే, ఇరుగు పొరుగు రాజ్యాలను హస్తగతం చేసుకొనక తప్పదు. సైనిక దురాక్రమణ ద్వారా టిబెట్‌ను కబళించటం చైనా రాజ్యవిస్తరణ యత్నంలో తొలి మెట్టు. టిబెట్‌కు వేలాది చైనీయులను తరలించి వారికి పునరావాసం కల్పించటమే గాక, ఇతర రాజ్యాలను వశపరచుకొనటానికి దానిని ముఖ్య స్థావరంగా ఉపయోగిస్తున్న విషయం జగద్విదితం.

ఈ రాజ్య విస్తరణకు అమెరికా, ఇండియా రెండు అడ్డుగోడలుగా నిలవటం చైనాకు చాలా

బాధాకరంగా ఉన్నది. ఆసియాలో ఎక్కడా అమెరికా చైనా ఆటలను సాగనివ్వకుండా అడుగడుగునా అడ్డు తగులుతున్నది. కొరియాలో అమెరికా సేనలు దిగి పోరాడకపోతే, కొరియా అంతా చైనా ఆధిపత్యం క్రిందకు వచ్చేదే. ఫార్మోజా తీరంలో అమెరికా ఏడవ నౌకాదళం తిష్ట వేయకపోతే, ఫార్మోజాను చైనా ఏనాడో అవలీలగా ఆక్రమించేది. ఇలా చైనా ఆశలను ప్రతిచోటా భగ్నం చేస్తుండటం వల్లనే అమెరికా చైనాకు గర్భశత్రువైనది.

చైనాకు ఆసియాలో రెండవ అడ్డుగోడ ఇండియా. ఆసియాలో చైనా, ఇండియా రెండూ రెండు దిగ్గజాలు. వైశాల్యంలోను, జనాభాలోను రెండూ ప్రపంచంలోకెల్లా పెద్ద దేశాలు. చైనా జనాభా 70 కోట్లు. మన జనాభా 40 కోట్లు. రెండు దేశాలకు అపార సహజ సంపద కలదు. బలవత్తరమైన దేశాలుగా రూపొందే అవకాశం రెండింటికీ ఉన్నది. అటువంటి మహదాశయంతోనే రెండూ కృషి చేస్తున్నవి. అయితే వాటి మార్గాలు వేరు. తత్వాలు వేరు. కమ్యూనిస్టు నియంతృత్వం క్రింద ఉన్న దేశం చైనా. మనది ప్రజాస్వామ్యం. ఎంత వద్దనుకున్నా, ఈ రెండు దేశాలమధ్య పోటీ ఏర్పడటం సహజం. ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని బడుగు దేశాలు

ఇండియా, చైనాలలో ఏదో ఒకదాని నీడ నాశ్రయిం-చడం ఎప్పటికైనా తప్పదు. ఇది ముఖ్యంగా ఆసియా నాయకత్వానికి సంబంధించిన సమస్య. ఆర్థిక, సాంఘి కాభివృద్ధికి ఇండియా, చైనా అనుసరిస్తున్న విభిన్న మార్గా లలో ఏది ఆసియాను ఆకర్షిస్తుం దనేది అవి సాధించే ఫలి తాలపై ఆధారపడి ఉంటుంది. నిన్న మొన్నటివరకు శాంతియుత సహజీవన సిద్ధాంతానికి కట్టుబడి పోటీ సాగింది. కాని ఈ శాంతియుత పోటీలో చైనా వెనుక బడిపోయింది. చైనాతో పోలిస్తే, జాతీయ రంగంలోనే కాక అంతర్జాతీయ రంగంలో కూడా నెహ్రూ నాయ కత్వాన భారతదేశం మిన్నగా ఉండి కీర్తి శిఖరాల నందుకున్నది. క్రమ క్రమంగా అభివృద్ధి నందుకొంటున్న ఆర్థిక వ్యవస్థవల్లనేమి, తన శాంతి కాముకత్వం వల్లనేమి, [పాక్, పశ్చిమ దేశాల మధ్య వారధిలా విశిష్టమైన పాత్రను నిర్వహిస్తున్న కారణంచేత అంతర్జాతీయ రంగంలో విశే షంగా గౌరవ ప్రతిష్ఠలు సంపాదించటం వల్లనేమి, బడుగు దేశాలను ఆకర్షించే అయస్కాంతమైనది భారత దేశం. వాటి గౌరవాభిమానాలను విశేషంగా చూరగొన్నది. ఈ రెప రెప చూసేసరికి చైనాకు కన్ను కుట్టింది, కంగారు పుట్టింది. భారతదేశం బలసంపన్నమైతే, ఆసియాతో తన ఆటలు సాగవని చైనా భావించింది.

ఆసియాలోని చిన్న రాజ్యాలు తమ కాళ్ళమీద తాము నిలబడగలిగే స్థితిలో లేవు. వాటికి రక్షణ అవసరం. భారతదేశం అట్టి రక్షణను కల్పించగలదనే నమ్మకం కలిగించగలిగినట్లయితే, ఆసియాలో కమ్యూనిజం వ్యాప్తికి ఇండియా తీవ్ర ప్రతిబంధకంగా తయారౌతుంది. ఆసియా ప్రజలలో ఈ భావాన్ని శాశ్వతంగా తొలగించడం అవసరమని చైనా భావించింది. ఈ దురుద్దేశంతోనే సరిహద్దు వివాదాన్ని పురస్కరించుకొని యుద్ధానికి పూనుకొన్నది. ఒకసారి తన సైనిక బలాధిక్యతను ప్రదర్శించి, తన తడాఖా చూపిస్తే, భారతదేశం తన్ను తానే రక్షించుకోలేక పోయిందని నిరూపిస్తే, తక్కుంగల ఆసియా దేశాలన్నీ గడగడ లాడిపోయి పాదాక్రాంత మౌతాయని, ఇక ఆసియాలో తన కత్తికి ఎదురుండదని చైనా ఎత్తుగడ. అందుచేత, ఈ సరిహద్దు వివాదాన్ని ఆసియా నాయకత్వానికి ఇండియా, చైనాల పోటీలో ఒక భాగంగానే మనం పరిగణించవలసి ఉంటుంది. కాని పక్షంలో, తక్కిన ఇరుగు పొరుగు రాజ్యాలతో గల సరిహద్దు వివాదాలను సామరస్య పూర్వకంగా పరిష్కరించుకొని, మన విషయంలో మాత్రం ఇంతదూరం వెళ్లటం అసంగతం కాదా? ఈ నంగనాచితనంలోని మోసం ఏమిటో గ్రహించటం అవసరం. కేవలం కొన్ని సరిహద్దు

ప్రాంతాలను ఆక్రమించటం కాదు చైనా లక్ష్యం. ఆ నిర్జన ప్రాంతాలు ఎవరి ఆధీనంలో ఉంటే నేమిటి? ఆసియాలో భారతదేశాన్ని కించపరచటం, తద్వారా తన ప్రాబల్యాన్ని వృద్ధి చేసుకోవటం, క్రమంగా ఆసియా రాజ్యాలను కబళించటం చైనా అసలు ఎత్తు. లోతుగా పరిశీలిస్తే, చైనా ఆసియా పాలిట బ్రహ్మరాక్షసి. ఆకాశా న్నంటే తన ఆశలను నెరవేర్చుకొనటం నిమిత్తం భారత దేశంపై కత్తికట్టింది. పెద్ద చేపను మింగితేనేకాని, తక్కిన చేపలు వలలో పడవని చైనా ఉద్దేశం. కారణం ఏదైతేనేమి, చైనా మనకు ప్రక్కలో బల్లెంలా, ఒక మహా పీడగా తయారైనది.

ప్రపంచంలో ఏ కిరాతకుడు ఏ అత్యాచారం జరి పినా లోకోద్ధరణార్థమే ఆ పని చేశానని ప్రకటించుకు న్నాడు. నైచ్యాన్ని కప్పిపుచ్చుకొనటానికి డాబుగా కనిపించే ఒక సిద్ధాంతం అవసరం. 30 సంవత్సరాలపాటు అంతర్యుద్ధం సాగించి దేశప్రజల "విముక్తి"ని సాధించిన తర్వాత కూడా చైనా కమ్యూనిస్టులు కుదుటపడలేదు. విప్లవధోరణి చావలేదు. పొగరు, కండకావరం, అణగలేదు. సాటి దేశాల సరసన కూర్చునే గౌరవం దక్కలేదన్న కోపం కూడా తోడై అంతులేని దురహంకారంతో, కన్ను మిన్ను కానని కండకావరంతో దుస్సాహసానికి ఒడిగట్టింది. వీటిని

సమర్థించుకోనటంకోసం సిద్ధాంత విభేదాలను సృష్టిం చింది. కాకపోతే, పంచశీల ఒప్పందంపై సంతకం పెట్టిన చైనా ఆ తర్వాత దానిని పంచభూతాలకు ఆహుతి చేసి యుద్ధం అనివార్యమని పేర్కొనట మేమిటి ?

అగ్రిరాజ్యాలలో అగ్రిరాజ్యంగా రూపొందాలని చైనా ఆకాంక్ష. ఎటుచూసినా వంగి దండాలు పెట్టే సామంతులు కనిపించాలి. రష్యా అండదండలు లేకపోతే ఈ కాంక్షను తీర్చుకోనటం సాధ్యంకాదని చైనా నియం తకు తెలుసు. ఈ కాలంలో అగ్రరాజ్యం అనే హోదా పొందటానికి అణ్వాస్త్రాలు అవసరం. కాని రష్యా ఆర్థిక, సైనిక, సాంకేతిక సహాయం చేసిందే కాని, అణ్వాస్త్రాల నిర్మాణానికి సహాయం చేయటం ప్రసక్తి వచ్చినప్పుడు, "ఎక్కడైనా బావకాని వంగతోటలో మాత్రం కాదని" అణ్వస్త్ర రహస్యం వెల్లడించటానికి నిరాకరించింది. చైనా-రష్యా విభేదాలకు అంకురార్పణ చేసిన విషయం ఇదే. ఫార్మోజా వంటి ప్రాంతాలను ఆక్రమించుకొనటా నికి రష్యా తన అణ్వస్త్రబలంతో అండగా నిలుస్తుందని చైనా ఆశించింది. కాని "నీ కోసం నేను అమెరికాతో యుద్ధం చెయ్యను" అని రష్యా కచ్చితంగా చెప్పింది. ఒక చోట యుద్ధానికి దిగితే అది అంతటితో ఆగదని, ప్రపంచ ప్రళయానికి దారితీస్తుందని, సర్వనాశనం తప్పదని,

తాను ఇన్నాళ్లు కష్టపడిసాధించిన ఐశ్వర్యం అంతా బూడిద పాలు ఔతుందని రష్యాకు తెలుసు. చైనాకేమి? తన దేహం కాకపోతే తాటిపట్టకు ఎదురు దేకమంటుంది. అణ్వస్త్ర యుద్ధం జరిగితే, రష్యా, అమెరికా ధ్వంసమై, తత్ఫలితంగా మానవబలగం మిక్కుటంగా గల తనకు బలాధిక్యత సిద్ధిస్తుంది; నష్టం తక్కువ, లాభం ఎక్కువ. కాని రష్యన్లుమాత్రం చైనావారి ముచ్చట తీర్చలేదు. యుద్ధం అనేది చైనావారికి దీపావళివేడుక కావచ్చు. యుద్ధంలో ప్రపంచ జనాభాలో సగంమంది చచ్చినా, తక్కిన సగం మందితో భూతలస్వర్గాన్ని సృష్టించుకోవచ్చునని ప్రకటించటం చైనా రాతుసులకే చెల్లింది. కాని రష్యన్లకు మాత్రం ఈ యుద్ధవేడుకలు గిట్టవు. ఫార్మోజా విషయంలోనే కాస్త సహాయం చేయకపోతే, ఇతర ప్రాంతాల విషయంలో చైనా సహాయపడుతుందా? రష్యన్లపై చైనావారు అలగటానికి ఇది రెండవ కారణం.

ఇదీగాక, ఇండియా చైనాకు ఒక సవతిగా తయారైనది. కమ్యూనిస్టు కూటమిలో చేరకుండా తటస్థంగా ఉన్న ఇండియాపట్ల రష్యా ప్రత్యేకాదరాభిమానాలు చూపటం, తనతో సమానంగా ఇండియాకు ఆర్థికసహాయం చేయటం, తొలి అగ్రరాజ్య శిఖరాగ్ర సమావేశంలో

ఇండియా పాల్గొనాలని ప్రతిపాదించటం చైనాకు చెప్ప నలవికాని ఈర్ష్య పుట్టించినవి. ఈ యీర్ష్య పెరిగి పెరిగి పేరుకుంది. తటస్థ విధానం, శాంతియుత సహజీవనం అంటే రోత, ఇండియా అంటే ద్వేషం, రష్యా పేరు చెప్పేసరికి అరికాలిమంట నెత్తికెక్కటం మొదలైన దుష్టలక్షణాలన్నీ ప్రకోపించాయి. ఇవన్నీ మనసులో రేగి రేగి యుద్ధోన్మాదం అనే హాలాహాలం పుట్టింది. కాని ఉన్మాదుడికి హాలాహాలమే అమృతంగా కనిపిస్తుంది.

రష్యాతో తాడో పేడో తేల్చుకోవాలని నిశ్చయించుకో దలచటం వల్లనే చైనా సరిహద్దు యుద్ధాన్ని ప్రారంభించిందని పెక్కుమంది అభిప్రాయం. కమ్యూనిస్టు రాజ్యాలు ఎట్టి దుశ్చర్యలు తలపెట్టినా వాటిని బలపరచటం కమ్యూనిస్టుల పవిత్రధర్మం. అలా బలపరచకపోతే అది ఘోరమైన అపచారం. తీరా తాము యుద్ధం ప్రారంభిస్తే, రష్యా తనను బలపరుస్తుందో లేదో చూద్దామని, ఈ దెబ్బతో ఏదో ఒకటి తేలిపోతుందని చైనా తలచింది. వారి కలహం మనకు ప్రాణసంకటమైనది. రష్యా తనను బలపరిస్తే సరేసరి. లేకపోతే వాళ్ళదారి వారిది, తన దారి తనది. కాని చైనా ఆశించినట్టుగా రష్యా పెకింగ్ దురాక్రమణ యుద్ధాన్ని బలపరచకుండా తటస్థంగా ఊరు

కొన్నది. తటస్థంగా ఉండటమంటే చైనా చర్యను ఖండించినట్టే లెక్క. దాంతో చైనాకు గంగవెర్రు లెత్తింది. కమ్యూనిస్టు కూటమిలో ముసలం పుట్టించాలని చైనా నిశ్చయించుకున్నది. కృశ్చేవ్ నాయకత్వంపై మావో ధ్వజమెత్తాడు. సిద్ధాంత విభేదాల పేరిట ఉభయదేశాలు పరోక్ష విమర్శలకు స్వస్తి చెప్పి బాహాటంగా ఒకదానిపై ఒకటి దుమ్మెత్తి పోసుకుంటున్నవి. మరొక విషయం ఏమిటంటే ఇండియాపై దండయాత్ర జరిపితే, ఇండియా తటస్థ విధానానికి స్వస్తి చెప్పి పాశ్చాత్య కూటమిలో చేరిపోతుందని, తద్వారా కృశ్చేవ్‌కు ఒక గుణపాఠం నేర్పవచ్చునని చైనా ఆశించింది. వారి లక్ష్యాలలో ఇది ఒకటి. కాని ఇండియా అలీన విధానానికి కట్టుబడి ఉండటంతో ఆ ఆశ కూడా నిరాశ అయినది.

(సిద్ధాంత విభేదాల విషయంలో చైనా చిత్తశుద్ధిని శంకించటానికి వీలులేదని కొందరి అభిప్రాయం. నిజమే కావచ్చు. కాని మనకీ, ప్రపంచానికీ సంబంధించినంతమట్టుకు ఫలితం ఒక్కటే. ఏ సిద్ధాంత ప్రేరితమైనా యుద్ధోన్మాదం యుద్ధోన్మాదమే.)

మనకు తటస్థించిన ఈ సరిహద్దు వివాదం కేవలం సరిహద్దుప్రాంతాల రక్షణకోసం సంబంధించినదిమాత్రమే కాదని, అందులో లోతైన సమస్యలు ఎన్నో ఉన్నాయని గ్రహించటం అవసరం. మొత్తం అంతర్జాతీయ పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని ఆలోచించినప్పుడే సరిహద్దు వివాద స్వరూప స్వభావాలను మనం పూర్తిగా అవగాహన చేసుకోగలుతాము. అణ్వస్త్రయుద్ధం సర్వనాశన హేతువని నిర్ధారణ అయినది కనుక, ప్రపంచ సమస్యల పరిష్కారానికి సైనిక పద్ధతులను విసర్జించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కాని ఈ విషయాన్ని చైనా అంగీకరించటంలేదు. ఇప్పటికీ అది యుద్ధమే శరణ్యమని వాదిస్తున్నది. నేడు ప్రపంచంలో యుద్ధోన్మాదంతో చిందులు త్రొక్కుతున్న దేశం, యుద్ధాన్ని పవిత్రసాధనంగా ఆరాధిస్తున్న దేశం, ప్రపంచ కమ్యూనిజంకోసం మారణహోమం జరిగి తీరాలని వాదిస్తున్న దేశం కమ్యూనిస్టు చైనా ఒక్కటే. వీలుచిక్కినప్పుడు ఆసియాను కబళించాలని పొంచి చూస్తున్న భూతం చైనా. ఆ రెండు విషయాలను మనం ప్రధానంగా దృష్టిలో ఉంచుకోవాలి.

ఆశించిన ఫలితాలు చేకూరక పోగా పరిస్థితి చుక్కెదురు కావటం వల్ల చైనా పోరాటాన్ని నిలిపివేసి పలా

యనం చిత్తగించినప్పటికీ, చైనావల్ల ప్రమాదం తప్పిం దని భావించటానికి వీలులేదు. చైనా మనస్తత్వం ప్రమాదభూయిష్టమైనది. దాని ఆశయాలు కూడా ఉప ద్రవకరమైనవే. అందుచేత, దానిని శాశ్వత ప్రమాదంగానే పరిగణించవలసి ఉంటుంది. చైనాతో దీర్ఘపోరాటానికి సిద్ధపడక తప్పదని హెచ్చరించటంలో ప్రధాని నెహ్రూ అంతర్యం ఇదే. ఆసియాదేశాలను ఒక కంట కనిపెట్టడం ఈ పోరాటంలో ఒకభాగం. ఆసియా దేశాలను అవసరమ యంలో భారతదేశం ఆదుకోగలదనే విశ్వాసం కలిగిం చాలి. ఆ విషయంలో మనం కృతకృత్యులం కావాలంటే, సైనికశక్తిని, ఆయుధబలాన్ని ఎన్నోరెట్లు పెంచుకోవ టమేగాక, శరవేగంగా ఆర్థికాభివృద్ధిని కూడా సాధించ వలసి ఉంటుంది. సైన్యాలతో దేశాలను జయించే రోజులు పోయాయి. ప్రేమతో, సత్కార్యాలతో హృదయా లను జయించవలసిన రోజులివి. ఈ విషయంలో విజ యాన్ని సాధిస్తే, అంతకుమించిన రక్షణలేదు. అందుకనే భారతదేశం ఆసియా, ఆఫ్రికాదేశాలతో సన్నిహిత సంబం ధాలను పర్చరచుకోవాలనటం.

సిద్ధాంత విభేదాలపై మాస్కోలో జరిగిన చర్చలు విఫలం కావటం, తత్ఫలితంగా చైనా, రష్యాలమధ్య

శతృత్వం పెరగటం ఒక విధంగా శుభసూచకం. ఇప్పట్లో చైనా మళ్ళీ పెద్దపెట్టున దండయాత్ర జరపకపోవచ్చు. అయినప్పటికీ వారి మనసులో ఏముందో తెలుసుకొనటం బ్రహ్మాతరంకాదు. రాక్షసమాయ కనుగొనటం ఎవరికి సాధ్యం? అట్టి ప్రమాదాన్ని ఎదుర్కొనటానికి దీర్ఘకాల, స్వల్పకాల చర్యలు తీసుకోకతప్పదు, ఈలోగా మన కర్తవ్యం ఏ లక్ష్యాలతో అయితే వారు గత సంవత్సరం దండయాత్ర జరిపారో వాటిని వమ్ముచేయటమే. మనకు శ్రీరామ రక్షగా ఉన్న నెహ్రూ నాయకత్వం చెక్కు చెదరకూడదు. అలీనవిధానాన్ని విసర్జించకూడదు. అంతర్జాతీయరంగంలో మన ప్రత్యేకతను నిలబెట్టుకోవాలి, ఈ విషయాలలో మనం ఏమాత్రం పట్టుదలను సడలించినా ఓటమిని అంగీకరించినట్లే కాగలదు. అన్నిటికంటే ముఖ్యం చైనాకు ఏ విధంగానూ, ఏ విషయంలోను లొంగిపోయామనే భావం కలగకుండా దృఢవైఖరిని అవలంబించటం. మనల్ని సరిహద్దుయుద్ధంలో ఓడించామని చెప్పగలగటానికి చైనాకు మిగిలింది ఇదొక్కటే. వారి షరతులపై వారితో సరిహద్దు వివాదంపై సంప్రదింపులు జరిపేటట్టు ఇండియాను ఒత్తిడి చేయాలని చైనా నానా అవస్థ పడుచున్నది.

కాని భారతప్రభుత్వం ససేమిరా అంగీకరించ లేదు. ఈ విషయంలో నెహ్రూ ప్రభుత్వం చూపిన పట్టుదల, ప్రదర్శించిన ధైర్య సాహసాలు శ్లాఘనీయం. పోరాట విరమణ సందర్భంలో చైనా ప్రకటించిన షరతులను భారత ప్రభుత్వం పూర్తిగా త్రోసివేసింది. 1962 సెప్టెంబరు 8 వ తేదీ తర్వాత జరిపిన దురాక్రమణకు చైనా పూర్తిగా స్వస్తి చెప్పనంతవరకు సరిహద్దు వివాదంపై చైనాతో సంప్రదింపులు జరిపే ప్రసక్తి లేనే లేదని మన ప్రభుత్వం భీష్మించింది. కొలంబో రాజ్యాలవారు మన వైఖరిని ఆమోదించటంతో మనకు ఎనలేని బలం చేకూరింది. కొలంబో రాజ్యాల ప్రతిపాదనల ప్రకారం, 1962 సెప్టెంబరు 8 వ తేదీ తర్వాత ఆక్రమించిన ప్రాంతాలను చైనా ఖాళీ చేయవలసి ఉంటుంది. ఇది చైనాకు ఒక గట్టి మొట్టికాయ. చైనా దురాక్రమణ జరిపిందని కొలంబో రాజ్యాలు బాహాటంగా ప్రకటించకపోయినప్పటికీ, పరోక్షంగా వారా విషయాన్ని స్పష్టం చేశారు. అందుకే ఆ ప్రతిపాదనలు చైనాకు ఆగ్రహం కల్గించినవి. కొలంబో ప్రతిపాదనలను సూత్రప్రాయంగా తప్ప, యథాతథంగా ఆమోదించనని చైనా ఇప్పటికీ మొండి పట్టు పట్టింది. నిర్నిబంధంగా ఇండియా సంప్రదింపులకు

అంగీకరించాలని చైనా పట్టుదల. ఇదికూడా ఒక షరతే కాబట్టి, భారత ప్రభుత్వం కొలంబో ప్రతిపాదనలను యథాతథంగా ఆమోదిస్తే తప్ప సంప్రదింపులకు అవకాశం లేదని కచ్చితంగా ప్రకటించింది. ఈ విధంగా సరిహద్దు విషయంలో ప్రతిష్టంభన ఏర్పడింది.

అయితే, ఈ వివాదంలో నైతిక విజయం మనకు ఈవరకే లభించింది. ధర్మం, ప్రపంచాభిప్రాయం మన పక్షాన ఉన్నవనటంలో సందేహం లేదు. సాటి కమ్యూనిస్టు దేశాలే చైనా దురాక్రమణను ఖండించాయి. ఈ విషయంలో తప్పంతా చైనాదే నని విమర్శించాయి. ఇటీవల జరిగిన పెక్కు అంతర్జాతీయ సమావేశాలలో చైనా విమర్శలకు, అవహేళనలకు గురి అయింది. కమ్యూనిస్టేతర రాజ్యాల సంగతి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ఒక్క అల్బేనియా తప్ప, దాదాపు ప్రపంచం యావత్తూ చైనాను వెలివేసిందంటే అందులో అతిశయోక్తి ఏమాత్రం లేదు. ప్రపంచంలో నేడు ఏకాకి బ్రతుకు బ్రతకవలసిన దుర్గతి పట్టింది కమ్యూనిస్టు చైనాకు. ఇంతే గాక, అంతయూ మన మేలుకొరకే అన్నట్టు, ఈ దండయాత్ర భారతదేశానికి ఒక విధంగా వరప్రసాదంలా వచ్చి పడింది, మహోపకారం చేసింది. ఈ సంఘటన

జాతి నంతటినీ మేల్కొల్పింది. అలసత్వం పోయింది. జాగృతి హెచ్చింది. దేశంలో కనీ వినీ ఎరుగని జాతీయ చైతన్యం వెల్లివిరిసింది. ప్రజలు కులమత విభేదాలను విస్మరించి ఒక త్రాటిపై నిలిచారు. దేశరక్షణకు ఆబాలగోపాలం నడుములు బిగించారు. వీర శంఖారావంతో దేశం మారుమోగింది. ఎంత దీర్ఘ పోరాటమైనా, ఎన్ని కష్టనష్టాలు సంభవించినా, ఎన్ని త్యాగాలు చేయవలసి వచ్చినా వెనుదీయమని, అంతిమ విజయం సాధించే వరకూ, నిదరపోమని ప్రజలు దృఢ ప్రతిజ్ఞ గైకొన్నారు. ఈ మనోనిబ్బరం వేయి అణ్వస్త్రాల పెట్టు. భారత జాతిని ఓడించడం ఎవరి తరం కాదనే విశ్వాసం ఇప్పుడు ప్రతి ఒక్కరికీ కలిగింది.

అయితే, దేశరక్షణ అంటే కేవలం సరిహద్దుల రక్షణ మాత్రమే కాదు. మన సంస్కృతిని, పరమ పవిత్రంగా ఎంచే మన మౌలిక విధానాలకు, మనం రూపొందించదలచుకున్న విలక్షణమైన ఆర్థిక, సాంఘిక వ్యవస్థకు భంగం వాటిల్లని విధంగా దేశాన్ని రక్షించుకోగలిగినప్పుడే మనం నిజమైన విజయాన్ని సాధించినట్టు. ఈ విషయాన్ని ప్రతి భారతీయుడు గుర్తుంచుకోనటం అవసరం.

ఎప్పటికైనా ధర్మం జయించి తీరుతుంది. ధర్మం మన పక్షానే ఉన్నది కాబట్టి మనకు అంతిమ విజయం తథ్యం.

కె. యస్. సుబ్రహ్మణ్యం

—(o)—



శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

## "నిలుపరా నీ జాతి నిండు గర్వమ్ము"

భారత స్వాతంత్ర్యసముపార్జనలో కవులు, రచయితలు నిర్వహించిన పాత్ర మహోజ్వలమైనది; అద్వితీయమైనది; నిద్రాణమైన జాతిని మేల్కొలిపి; కంకణ విసర్జనల కిది కాలముగాదని హెచ్చరించి కర్తవ్య పరాయణము గావించిన వాఙ్మయము దేశభాషలలో పుష్కలముగా నున్నది. అవసర సమయములందు సర్వస్వము త్యాగము జేసి, లాఠీ దెబ్బలకు గురియై చెరసాలల కేగిన రచయితల, కవుల నిదర్శనాలు ఆధునిక భారతీయ వాఙ్మయమున అనేకము కనుపించు చున్నవి. తిలక్, గాంధి, నెహ్రూ ప్రభృతులు భారతదేశ స్వాతంత్ర్య సమరములో పాల్గొనవలసిన అవసరము తటస్థించక పోయి నచో, సారస్వత క్షేత్రములోనే తమ పూర్తిసమయమును వినియోగించెడివారని చెప్పినచో సత్యమునకు తలవంపులు

కలుగజాలవు. అరవింద, రవీంద్ర ప్రభృతులైన మేధావులు, రచయితలు భారత స్వాతంత్ర్యోద్యమానికి యిచ్చిన ప్రోత్సాహము నిరుపమానమైనది.

సుమారొక నూరుసంవత్సరాల పోరాటము తరువాత భారతదేశములో విదేశ పరిపాలన అంతమొందినది. కొన్ని శతాబ్దాలనుండి ఆర్థికముగా, సాంస్కృతికముగా చితికిపోయిన దేశమును తిరిగి అభివృద్ధి పథములో పురోగమింప జేయు కృషిలో ప్రభుత్వము, ప్రజలు నిమగ్నులైయుండగా మన ద్వారాల పచ్చతోరణాలను జూచి కళ్లుకుండిన మిత్రద్రోహి, మేకవన్నెపులిగా నుండిన పొరుగుదేశము, విశ్వాసఘాతుకముగా వ్యవహరించి, వెన్నులో పొడిచి, మన సరిహద్దులమీద దురాక్రమణ గావించినది. ఈ దురాక్రమణ దేశీయులను నిరంతరము అప్రమత్తులుగా నుండవలసినదని హెచ్చరిక గావించినది. ఈ హెచ్చరిక తత్క్షణమే దేశములో రణభేరిని మ్రోగించినది; ఆసేతుశీతనగ ప్రాంతము దేశరక్షణకు కంకణము గట్టుకొన్నది; మరొక పర్యాయము జాతి, మత, ప్రాంత, భాషా భేదాలను విస్మరించి, భారత జాతీయతచే ప్రబోధితులైన కవులు, రచయితలు శంఖారావము గావించినారు. తత్ఫలితముగా పురి మేల్కొన్నది; గిరి మేల్కొన్నది; గిరి గుహలో కేసరి మేల్కొన్నది; గిరి పుర వనముల ధర మేల్కొన్నది; నర నారీసంతతి మేల్కొన్నది. ఈ మేల్కొలుపుటకు ప్రతిధ్వనియే యీ "రణభేరి" కావ్య సంపుటము.

దేశభాషలన్నింటిలోవలెనే ఆంధ్రభాషలో శంఖారావములతో కలము కసరత్తులు జేయుచు రచయితలు ముందుకు

దూకినారు. వీరిలో వృద్ధులు, యువకులు, నరనారీజనులు అన్ని తెగలు కనుపించుచున్నారు. ఈ సమర సాహిత్యము మన దేశభాషా చరిత్రలలో మహోజ్వలమైన అధ్యాయము. గంగ యమునలు పొంగివచ్చి, అంగారమ్ముల నుమియ జొచ్చిన తరుణములో, మంచుకొండలో, మనిషి గుండెలో మహావహ్ని శిఖ లుద్భవించినవి. అందులో కొన్ని అక్షరరూపము ను దాల్చి. స్వేచ్ఛాభారత పరిరక్షణ సమరానికి కాళికగా ప్రత్యక్షమైనవి. ఇందులో కొన్నింటిని క్రోడీకరించి యీ సంపుట రూపముగా ప్రచురించుట జరిగినది. ఈ ప్రచురణ ప్రయత్నము సర్వవిధాల ప్రశంసనీయమైనది. ఆంధ్రభాషలోని సమర సాహిత్యానికి ప్రాతినిధ్యము వహించు యీ సంపుటము సమగ్రమై జాతి ప్రబోధకముగా నున్నది. మంచి ముఖచిత్రముతో, చక్కగా యీ సంపుటమును ముద్రించి, ఆంధ్రమహాజనుల కర్పింప జేసినందుకు సంపాదకులైన శ్రీ దాశరథి రంగాచార్యులు, ప్రచురణకర్తలైన శ్రీ చందా నారాయణ శ్రేష్ఠి, విద్యావిషయక పత్రికాశకులు, ముద్రాపకులైన శ్రీ బాలా త్రిపుర సుందరీ ముద్రణాలయం వారు సర్వవిధాల అభినందనీయులు.

"కదన మందున ధర్మము దేలిపోవలెన్", "మా వలనన్ ధర్మువు నిల్పియుంట సమరవ్యాపార మేపార మంజుల రోచిన్ జయలక్ష్మి మా కెదురు వచ్చున్ రేపు మున్మాటికిన్" అను ఆత్మ విశ్వాసముతో భారతజాతి ముందడుగు వేయుచున్నది.

సత్యమేవ జయతి.

# విజయోఽస్తు

శ్రీ అల్లాడి వెంటయ్య
(మునిసిపల్ కౌన్సిలర్)



మనది పుణ్యభూమి. శాంతికి ఇది పుట్టినిల్లు, అహింసకు మెట్టినిల్లు.

మనం అనేక దేశాలకు ధర్మభిక్ష పెట్టాం. అలా మన భిక్షనందుకున్న దేశాల్లో ప్రముఖ దేశం చైనా. అది మన పొరుగు దేశం. దానికి మన దేశంతో వేల సంవత్సరాల సంబంధం ఉంది; స్నేహం ఉంది.

ఆ దేశంతో మనం పంచశీల ఒప్పందం చేసుకున్నాం. వారు మన దేశానికి వచ్చినప్పుడు ఘనంగా స్వాగతం చెప్పాం.

అందుకు ప్రతిగా వారుమనకు ద్రోహంతలపెట్టారు. తిన్నఇంటి వాసాలు లెక్క పెట్టారు. తమకు జ్ఞానభిక్ష పెట్టినదేశంమీదనే దండెత్తారు. ఈ పవిత్ర భారతావనిని కబళించాలని కాంక్షించారు.

మనం పరాయి దేశంపై దండెత్తం. కాని, మన దేశం మీద దండెత్తిన వాణ్ణి ప్రాణాల్తో వదలం. ఇదీ మన నీతి. ఇదీ మన విధానం.

చైనావారు పశుబలం చూసుకొని మనపై దండెత్తారు. మనం ధర్మబలంతో వారిని ఎదిరించాం. ప్రపంచం యావత్తూ మనను బలపర్చింది. సత్యం జయించింది. ధర్మం జయించిది. పశుబలం ఓడిపోయింది. తోకముడిచి వెనక్కు జారుకుంది.

అంతటితో యుద్ధం అయిపోయిందా? కాలేదు. మనకు వారితో వచ్చిన పోరాటం ఆయుధాల పోరాటం కాదు. అది సిద్ధాంతాల పోరాటం. అది రావణాసురుని కాష్టంలాంటిది. సదా మండుతుంటుంది.

మన సిద్ధాంతం గెలవాలంటే దాన్ని గురించి ప్రజలు తెలుసుకోవాలి. చైనావాని మోసాన్ని గుర్తించాలి. ఆ పని కవులకంటె చక్కగా నిర్వర్తించ గలవారు లేరు. వారా పనిని నిర్వర్తించారు కూడా.

వారి రచనల నన్నింటినీ సేకరించి "రణభేరి" గా కూర్చిన సంపాదకులు, అందంగా అచ్చువేసి ఆంధ్ర ప్రజానీకానికి అందిస్తున్న ప్రకాశకులు అభినందనీయులు.

ఇది ఒక ఉత్కృష్టమైన సంకలనం.
తెలుగువారు దీనిని ఆదరించాలి.

# ఇందులో....

This book is dedicated to the warriors who sacrificed their lives at the altar of our mother-land in the Himalayan borders. Brigadier Sri G. M. Sayeed, area Commander has kindly consented to accept the dedication on their behalf. To him, I express my deep sense of obligation.

- Editor.

*మాతృదేశ రక్షణకుగాను*

*మంచుకొండలపై శత్రువుతో*

*పోరాడుతూ అసువులు బాసిన*

అమరవీరులకు

# అంకితము

భరతభూమిని కబళించు పాలసులను
కాల్చి కూల్చిన మేటిముక్కంటి నీవు
చావు నీకున్నె ? చచ్చెను చావెగాని
అందుకొనుమయ్య 'రణభేరి' అంకితమ్ము.

మంచుకొండను పుక్కిట నుంచుకొందు
మంచు వచ్చిన చైనీయ వంచకులకు
ప్రళయవహ్నివై ప్రాణము ల్బాసినావు
అందుకొనుమయ్య 'రణభేరి' అంకితమ్ము

తిమిర పుంజమ్ములట్టుల దిశలు నిండి
నీదు దేశమున్ మ్రింగగా నిల్చినట్టి
చీని చీకట్లు చీల్చిన చిచ్చు నీవు
అందుకొనుమయ్య 'రణభేరి' అంకితమ్ము.

లెక్కచేయక ప్రాణాల డొక్కమీరి
ఒక్క దెబ్బకు వందల తుక్కుచేసి
జాతి కాపాడినట్టి విజేత నీవు
అందుకొనుమయ్య 'రణభేరి' అంకితమ్ము

తల్లి పయ్యెద నెవ్వడో తాకెనన్న
ఓర్వజాలక రణమున కురికినావు
తుచ్ఛులను కూల్చి ఒరిగిన దొరవు నీవు
అందుకొనుమయ్య 'రణభేరి' అంకితమ్ము

శ్రీ "అజంతా"

## న్యూస్ రీల్

హంతకుని అరచేతులు ఎరుపు
వంచకుని మాటల తెరలవెనుక పడగ విప్పిన విష
సర్పాలు ఎరుపు
అరమోడ్పు కన్నులలో విద్రోహి వెన్నెల కిరణాలు
ఎరుపు
చైనా అధినేత మావో కనుబొమ్మల కొమ్మలపై
ఘృతేళికలు మరీ మరీ ఎరుపు
ఎర్రదనం రాజకీయ విద్రోహానికి గుర్తు
ఎర్రజెండా మిత్రభేదానికి గుర్తు.

చైనా చరిత్ర అనే చీకటి నికర్షణంలో ఎటు చూసినా
నెత్తురు మడుగులే
నెత్తురు మడుగులోనే ఉద్భవించినది కమ్యూనిజం అనే
కమలం
భాష్యకారుడు ఎవరైతేనేం
మనిషి కన్నీళ్ళను చషకాలలో నింపుకొని త్రాగడంలో
అంతా ఉన్మదిష్ణువులే.

ఫాసిజం కోరలు తీసిన పులి
మావో కమ్యూనిజం దాన్ని ఉపాసిస్తున్న నెచ్చెలి
స్నేహాన్ని ఉచ్చరిస్తూనే
కంఠాన్ని ఉత్తరించడం పెకింగ్ పండితుల ప్రత్యేక శైలి.

చైనా నిఘంటువులో శాంతి అనే మాటకు అర్థవివరణం
లేదు
యుద్ధ పర్వంలో అపశ్రుతి

లేదా మారణహోమానికిముందు రాతుసుదు ఒళ్ళు
విరుచుకుంటున్న విశ్రాంతి.

మార్క్సిస్టు మేఘాలు మిథ్యా కుసుమాలు వినా మ
దేన్నీ వర్షించవు
దివాస్వప్నాలవల్ల కడుపు నిండుతుందా, మండుతుందా
తుపాకులు ఆకలి తీర్చలేవుకదా
ఆర్థిక స్వర్గారోహణంనుంచి హఠాత్తుగా నేల
కూలడంతో
ఆసియాఖండాన్ని ఒలుచుకుని తినడానికి ఉద్యమించారు
చైనావాళ్ళు
క్షుధార్తి చల్లార్చుకొనడానికి.

ఇండియా అక్షయపాత్ర
దాన్ని ఆశ్రయించుకున్న వాళ్ళంతా నిద్రాళువులు
నిద్రాళువుల సంహారానికై జరిగినకుట్ర ఏవిధంగా
బద్దలైనదీ అంతా విన్నదేకదా.

సామ్యవాద విభావరిక్రింద క్షామదేవత నాట్యం చేయ
డం విడ్డూరమైన విషయమే
చైనా సమష్టి క్షేత్రాలలో పశులుసైతం భిక్షాటన
సాగిస్తున్నట్టు ఇటీవల వార్తలు వింటున్నాం
దేహీ అనడంలో తప్పులేదు
కాని మానవమాత్రులకు ఆమాత్రం జ్ఞానం ఉంటే
ఇంకనేం

కనుకనే స్టాలిన్ ఫార్ములా ప్రకారం
ఇష్టకార్య సాధనకు ఇతరుల ఆకాశాలను
    ప్రముచ్ఛలించినా
స్నేహవృక్షాలను వెన్నుపోటు పొడిచినా
తలపెట్టిన కార్యాన్ని గుట్టుచప్పుడు కాకుండా నెర
    వేర్చుకోవడం ప్రధానలక్ష్యం.

చైనాలో ఒక ప్రజాకవి ఇటీవల మావో కనుబొమ్మ
    లపై మహాకావ్యం వ్రాశాడట
మావో గొప్పవాడే
మనిషి ఉచ్ఛ్వాస నిశ్వాసాలపై పన్ను విధించడంఅన్నా
సీతాకోక చిలుకలను సిల్కు దారాలతో ఉరితీయడం
    అన్నా
అతనికి చాలా ఇష్టం.

ప్రధాని చౌ ఎన్-లై అంతర్జాతీయరంగంలో ఆటబొమ్మ
అరమోడ్పు కన్నుల వెనుక అంహస్సు రగులుతున్నా
అందంగా అరవిందంలా నవ్వడం అతని రాజకీయ
    చ్ఛందస్సు;

చైనా ఇకనుంచైనా తన చెయిదాన్ని మార్చుకుంటుం
    దని అనుకోవచ్చునా
ఖచ్చితంగా చెప్పడం కష్టమే
ప్రతీకార జ్వాలలతో మెరుస్తున్న నా హృదయాన్ని
    ఏనాడో యుద్ధరంగానికి బట్వాడా చేశాను.

శ్రీ అణ్ణన్ పి. వి.

## లేవరా! సోదరా!

లేవరా! సోదరా
భారతీయుడా
వెన్నుపోటు పొడచినట్టి
పగతు నొత్తివేయర ॥లే॥

"రణ"ము లోన
గళమునెత్తి
శంఖ మూదగా
"భేరి" మోగ్రిగగా ॥లే॥

పేల్చిరా, శత్రువులను
హతమార్చరా
బొందిలోన
ప్రాణముండ
ముందున కడు గేయరా ॥లే॥

శాంతిపాఠ మొదలర
దేశానికె యెసరొచ్చెర
హద్దుమీరి వచ్చువాని
కసరి విసరి కొట్టరా ॥లే॥

మదముతోడ కదలువాని
హడలునట్లుగా
ముదముతోడ వెడలగొట్టరా
అవని భక్తి చాటరా ॥లే॥

## రణభేరి

రణభేరీ రణభేరీ
ఎక్కడి దీ రణభేరీ !
ఎక్కడి దీ రణాహ్వాన
మెక్కడి దీ హుంకారం
హుంకారం క్రేంకారం
హయ హేషలు రథఘోషలు
హాలి హాలి హాలి హాలికేకలు
ఎక్కడి దీ కోలా హాలం
కోలాహాలం హోలాహాలం !

నా నరాల నరనరాల
ఎక్కడి దీ విద్యుద్వేగం
జ్వాలాముఖి లావా లాస్యం !
ఎక్కడి దీ రణభేరీ !
రణభేరీ జయభేరీ !

శతమహాద్రు లదిరినాయి
శతజలదా లురిమినాయి
భూకంపం పుట్టినట్టు
సుడి తుఫాను కొట్టినట్టు

ఎక్కడి దీ రణభేరీ
ఎక్కడి దీ జయభేరీ !

ఎక్కడి దీ రణాంగణం
రణాంగణం రణదుర్గం
రణదుర్గం శిరిదుర్గం
సుధాధవళ హిమదుర్గం !
ఎవరు ఎవరు ఎవరు చిందిరీ సీమల
ఈ సీమల చంద్రి శుభ్రి
హిమ సీమల గిరి సీమల
ఎవరు చింది రీ రక్తం
నర రక్తం నర రక్తం
గంగా యమునా జలాల
కడిగిన చెరగని రక్తం !
నర రక్తం నర రక్తం
నా తమ్ముల నర రక్తం !
నర రక్తం నా రక్తం
సహించునా నా రక్తం !
నవసైనిక యువరక్తం !
ఓ హో సైనికులారా !
రండి రండి రణభూమికి

రణభూమికి రండి రండి!
ప్రళయ కాల రుద్రులై
భయద వీర భద్రులై
రండి రండి రండి రండి
రండి రండి రణభూమికి
ప్రళయాగ్నులు రేగినట్టు
లావా నది సాగినట్టు
పెనుగోడల పెల్లగించి
విను వీధులు కుళ్ళగించి
గిరులు పెరికి అరుల నరికి
హరోం హరా హర హర హర
రండి రండి రణభూమికి
చిచ్చుల పిడుగుల కురిసీ
విచ్చిన కత్తులు మెరిసీ
రండి రండి రణభూమికి.



శ్రీ అబ్రహాము నూతక్కి

## పిలుపు

దేశాన్ని రక్షింప రావా - మాతృ -
దేశాన్ని దక్కించుకోవా.... ॥దేశా॥

చీనా - దురంతాలు - చేబూని పంతాలు
కలుకు కత్తులుదూసి - సరిహద్దుపై నిల్చె.... ॥దేశా॥

మంచుకొండలలోన - పొంచి పండ్లిగిలించు
కించిత్తు చీనా నియంత గొంతుక దుృంచి.... ॥దేశా॥

నీ చెలిమి కోరాడు - నీ - బలిమి కోరాడు
నీ నీతి సూత్రాల నిలిచి భజియించాడు -
ఆ పాడు చైనీయు డోయి - నేడు మన పాలి
శతృవైనాడూ.... ॥దేశా॥

నీ సంపదల పెంపు - నింపు సొంపుల గాంచి
యీసడించిన - చీన మోసగానిని తరిమి.... ॥దేశా॥

శాంతి సూత్రాల వేదాంతాల బోధించు - మన
కన్న తల్లినే బాకులతో కుమ్మెటి - రాకాసులను
దుృంప రావా-మాతృదేశాన్ని దక్కించుకోవా ॥దేశా॥

భరత చండీశ్వరీ పద పద్మముల గొల్చి - గాండీవివై
శతృ మూర్ధమ్ములను జీల్చి.... ॥దేశా॥

వీరమార్తాండ తేజస్సమానుడ వీవు
ధీరోత్తముడ వీవు - శౌర్యార్ణవుడ వీవు
సమరసింహానివై శతృమూకల చెండి ॥దేశా॥

## నేఫా మహావీరుడు

(నేఫాలో ఎనిమిది మంది చైనీయులను ఒక్క చేతితో వధించి వీరస్వర్గా న్నలంకరించిన సైనికోద్యోగి నుద్దేశించి)

నీ యూరేమో కాని
నీ పేరేమో కాని
నిజంగా నీవు భారతీయుడవు
నిర్భర సంగరాంగ ణాకాశంలో
నిష్ఠుర దంభోళిలా మెరిశావు !
నీ పరాక్రమ సమాటో పాలు
నిర్జరులకే వెరగు పుట్టించాయి !
నిక్కం చెప్పాలంటే
నీవే నిర్జరుడ వోయి
మేమంతా ఉన్నాము
మిడిమేలపు బ్రిదుకులతో
మాతృభూమి సంక్షేమానికి
మరణించు ధైర్యం చేయలేక
నీ యూరు పేరు
నీ పేరు తీరు
నిదానించి చూస్తే
మా కెందుకు లే నేస్తం
ఏనాడో చెప్పాడుకదా మానన్నయ్య
ఏరులూ శూరులూ ఒక టేనని
ఎవరికీ తెలియదు వారి జన్మమనీ

వీరత్వమంతా నీలో - మి
న్నేరై ముంచెత్తి వైచింది
దాని తరంగాల తాకిడికి
తట్టుకోలేని చైనీయులు
ఇలపై సికతా సేతువులై
ఎనిమిది మంది కూలారు.

గతంలోని ఏ వీరుని
గాథలతో పోల్చి నిన్ను
గౌరవించమంటావో
కదనసింహా! చెప్పవోయి!
నీ యుదాత్తాశయాల
నిగ్గులేని వారితోన!

భార్యకోసమో లేక మరింకేదైనా
స్వార్థం కోసమో
కత్తి నెత్తి సవాళ్లే
గతంలోని మన మాసీళ్లు.

కని పెంచిన మాతృభూమి
గాసి తీర్చి నడుం కట్టి
నీవలె నిస్వార్థంగా
నిలిచి పోరినారొ! వారు
అందుచేతనే నీకూ వాళ్ళకూ
ఆశయాల పావిత్ర్యం వల్ల
హస్తి మశకాంతరం
అవలీలగా ఉంది.

ఓ నేఫా వీరవర్య !
ఉదిలపడకు మాత్మయందు
పాంచ భౌతికమ్ము లీనూ
బంధము రాలె నటంచును

అచ్ఛేద్యుడ వమరుడ నీ
వగుదు వింతపట్టు నిజము !

శౌర్యగుణానికె - మహదా
చార్యకంబు నెరపజాలు
నీచేతన రుద్రాకృతి
నిచ్చలు నడిపించు మమ్ము !
దురాక్రమణ మన్న మహా
దుష్టాంధక తమము చీల్చ.

మృషాసమాధు లేల నీకు
మృణ్మయాలు దృషన్మయాలు !
నలభై కోట్లకు పైబడి
నట్టి మాదు హృదయమ్ములె
స్వర్గసమాధులు నీకగు
చంద్రారుణ తారకముగ.

స్వస్తి ! స్వస్తి ! మహావీర !
సర్వలోక పథాల నీకు !
స్వస్తి ! స్వస్తి ! నీ భారత
జనయిత్రి కహర్నిశమ్ము !

శ్రీ ఆరుద్ర

## రణనినాదాలు

గుండెల డిండిమాల
రణఘోషలు దిక్కులు పిక్కటిల్లగా
లెండి పదండి రండి
లవలేశము దేశము వైరిచేతిలో
నుండగరాదు: జల్దుకొని
యోధులు వీధుల బార్లు తీరుడీ!
ఖండనదీక్షతో కదన
పాండితి చూపుడి! వెండికొండపై.
మెత్తని వారల జూచిన
మొత్తెడి చండాల గుణపు ముష్కరులౌరా!
కత్తులు దూసిరి మనపై
నెత్తురు పారించి కొండ నెత్తమ్ములపై
సుత్తీ కొడవలి గుర్తులు
హత్తిన జెండా వహించు నతడెందులకా?
సుత్తితొ తలపై మొత్తుచు
కుత్తుక కొడవలి ధరించి కోయుట కొరకే,
ఆటలు సాగనిము
కపటాత్ముల మాయలు తేటతెల్లమై
సూటిగ సూర్యరశ్మివలె
చూపులకందెను నేటినుండి మో
మోటము వీలులేదు మన
పూర్వవిధానము మారిపోయె ము
మ్మాటికి గెల్తుమింక మన
మంచికె మ్రోగెను యుద్ధవాద్యముల్.

# శ్రీ కృత్తివాస తీర్థులు, తల్లా వజ్ఝల

చీనా సామ్రాజ్యవాదం

సామ్రాజ్యం మహాశ్మశానం
శాసకు లంతా కీచకులే !
మమత్వ మెరుగని పిశాచులా
మానవులేనా చైనా చవటలు !
చితాభస్మ రాసుల పైనా
శీర్ష మెత్తగా చీనా కోరిన
నిట లేక్షా క్రాంతి కీలలో
కుటిల శ్రీ భస్మరాసులా !
మానవాశ్రు రోదనలోనా
సామ్రాజ్యపు సమర స్వానం ?
శాస్త్రాలూ, పరిశోధనలూ
సమ రాగ్నికి సమిధలు కావా ?
వల్లకాటి అధికారానికి
వాంఛించే చైనా దేశం
అణ్వస్త్రము నాహ్వానించును.
భూగోళము బుగ్గైపోయిన
పొంగి పోవు పైశాచిక చీనా !
అయ్యయ్యో రక్తపు టేళ్ళలో
అరాతి చీనా వాల్లీసకమా ?

## శ్రీ కృష్ణమాచార్య దాశరథి

### జాతి మేల్కొన్నది!

గిరిమేల్కొన్నది, పురి మేల్కొన్నది
గిరిగుహలో కేసరి మేల్కొన్నది
గిరి, పుర, వనముల ధర మేల్కొన్నది
నరనారీసంతతి మేల్కొన్నది.

మెత్తని పుష్పమువంటి భారతము
కత్తిబట్టి కేలెత్తి లేచెను
శాంతిసహానములు కురియుభారతము
అంతులేని కోపాన చూచెను
నటస్వామియై తాండవించెను
కుటిలశత్రువుల గుండె చించెను
గంగ యమునలే పొంగివచ్చెను
అంగారమ్ముల నుమియజొచ్చెను
మంచుకొండలో, మనిషిగుండెలో
మహోవహ్ని శిఖ లుద్భవించెను
స్వేచ్ఛాభారత పరిరక్షణకై
వివిధవర్గములు మైత్రిపెంచెను
అనువణు వొక అణుబాంబై విరిసెను
అరివర్గముపై అనలము కురిసెను.

తెలుగువాడనీ అరవవాడనీ
కులము వేరనీ మతము వేరనీ
ఎల్లభేదములు కల్లలాయెను
పల్లె పట్టణం ఏకమాయెను

మిల్లుకూలికీ పల్లెరైతుకూ
ఉల్లమొక్కటై ఉల్లసిల్లెను
తరుణీతరుణుల శిరముల ఉరముల
భరతపతాకము రెపరెపలాడెను
గిరిశిఖరముపై పురసౌధముపై
తరుశాఖలపై తళతళలాడెను
తీగెనుపువ్వై, నదిలో తరగై
మదిలో తలపై వలపై వెలసెను
శత్రువుగుండెల శస్త్రముగ్రుచ్చగ
సాగిరమ్మనుచు జనులను పిలిచెను
ధైర్యమునేర్పెను శౌర్యముకూర్చెను
తరతరాల మన దాస్యముతీర్చెను
మనకు దీపమై మాతృరూపమై
అరికిశాపమై అవతరించెను
ఇంద్రచాపమై నింగిదారిలో
డెందమలరగా అందగించెను.

పగరగుండెలో వాడిబల్లెమై
మంచుకొండతలుపులకు గొళ్లెమై
స్వతంత్రతా ధనరాశి కాచెను
నిఖిలశత్రువుల నేలరాచెను
సత్యాహింసల కాలవాలము
ధర్మవిరుద్ధుల పాలి శూలము
భరతపతాకము చేత ధరించి

అరివర్గముపై జయము పరించి
మహాసైనికులు, మహానాయకులు
మనదేశమ్మును కాపాడేరు.

కదనభీములై పరశురాములై
పదండిభారత వీరుల్లారా !
భరతజాతి కిక తిరుగులేదురా !

పరాక్రమింపుడు శూరుల్లారా !
గిరిమేల్కొన్నది పురిమేల్కొన్నది
గిరిగుహాలో కేసరి మేల్కొన్నది
గిరి, పుర, వనముల ధర మేల్కొన్నది
నరనారీసంతతి మేల్కొన్నది



శ్రీ కృష్ణాచార్యా, కాశి

భారతీయోద్బోధ

శ్లో॥ బ్రాహ్మం క్షాత్రం బలం, ధైర్యం,।వర్ధతాం నః ప్రథా జయః
వీరాణాం భారతీయానాం । "రణభేరీ" పరిఘోషణాత్.

ఉ॥ సోదర భారతీయ ! విన
కుంటి వొకో, రణభేరిఘోష ? చై
నా దనుజాధముల్, పరమ
నాస్తికు లకరిమవృత్తిఁ బూర్వ మ
ర్యాదలఁ ద్రోసిరా జని - క
టా ! మన పావన మాతృభూమిఁ గా
లూఁదుచు నున్నవార; లెదు
రొడ్డఁగ లె, మ్మెదు రొడ్డ రమ్మిఁకన్.

ఉ॥ శాంతియు, మైత్రియున్, సమత,
సత్యము - మున్నగు నున్నతార్య సి
ద్ధాంతము లెల్ల మాకును హి
తంబులె యంచు, హిమాచలోత్తర
ప్రాంతముఁ గొల్లఁ గొట్టి నటు
లల్లదిగో 'రణభేరి' మ్రోగెఁగు; నా
హంతల నాత్మశక్తి హాత
మార్పఁగ సోదర ! లెమ్ము, రమ్మటన్.

చ॥ జననియు, జన్మభూమియుఁ బ్ర
శస్తిని మెచ్చెను స్వర్గ సీమకం
టెను; మఱి తత్ప్రరక్షణమె
నీతి సుపుత్త్రుల; కే తదర్థ మ
ర్పణ మొనరింపఁగాఁ దగును
బ్రాణ ధనంబు లటంచు వీర ఘో
షణ "రణభేరి" సేయు; నను
జా! కృతకృత్యతఁ గాంచ లెమ్మికన్.

చ॥ ఉరుతరుణార్కమూర్తిఁ బురు
షోత్తముఁ, గాకతీ వీర రుద్రభూ
వరునిఁ, బ్రతాపసింహుని, శి
వాజి స్మరించుచు - భారతీయ సో
దరవరులార! చైనియుల
దాడి నడంపఁగ లెం డటంచుఁ జె
చ్చెర "రణభేరి" మ్రోఁగు; నెడ
సేయక రండు ధృతాస్త్ర శస్త్రులై.



శ్రీ కొండమాచార్యా M.

## శక్తిరథోత్సవమ్

కదలె కదలె శక్తి రథము
కదలె ప్రిజాశక్తి రథము
కనత్కనక కింకిణీక
గల గల గల ఘంటాచయ
గణ గణ గణ రవములతో.

శోణ శుక్ల హారిత వర్ణ
సుందరమగు పెక్కెముతో
నీల జలద గర్జోపమ
నేమి భయద ఘోషముతో

కదలె కదలె శక్తి రథము
కదలె ప్రిజాశక్తి రథము.

కనక తప్పెటల మ్రోతలు
కాహళికా నిస్వనములు
సకలదిశా కర్పరముల
శకల శకలములు సల్పగ

కదలె కదలె శక్తి రథము
కదలె ప్రిజాశక్తి రథము.

మధ్యందిన మార్తాండుని
మండల పటు తేజముతో
కాలు వచ్చినట్టి వింధ్య
శైల రాడ్విలాసముతో
　　కదలె కదలె శక్తి రథము
　　కదలె ప్రజాశక్తి రథము.

గిరి కంధరములఁ బొంచిన
అరి వృకముల హతమార్చుడు
శైల వనుల డాగిన రిపు
జంబుకములఁ బరిమార్పుఁడు.

శ్రుతి చతుష్క చక్రమ్ముల
శోభిల్లెడు తేరు గదలె
బలవద్రిపు రుధిరముతో
కల యంపిని జల్లరండు.

కపట కుశల వైరి శిరః
కాండమ్మును బగులనడచి
తెల తెల్లని పునుకలతో
జిలుఁగు ముగ్గు లిడగ రండు.

తల్లి కొంగు ముట్ట పగలు
పిల్ల పిల్ల తరముఁ బట్టి
పొలి పొలి పొలి పొలి పొలియని
బలిదీయుడు బలిదీయుడు.

నలువది కోటుల శిరాల
వెలుఁగు మహాకాళి యిద్ది
ఎనుబది కోటుల కరాల
నెసఁగు మహాచండి యిద్ది.

ఒక్క కంట సుధా వృష్టి
ఒక్కట అంగార వృష్టి
జడి గొల్పెడి రమ్య ఘోర
శాంత వీర మూర్తి యిద్ది.

పగతుర రణరంగ మందు
భుజింపంగ నరుగుచున్న
తల్లిని మరిమరి నుతింప
తరలిరండు తరలిరండు.

జయ జయ భారత సవిత్రి!
జయ విరోధి విలయ కర్త్రి!
జయ భారత జనయిత్రీ!
జయ నాస్తిక జీవహర్త్రి!
జయ భరత ప్రియజననీ!
జయ మంగళం సంధాయిని!

జయ జయ జయ జయ జయేతి
సాధు వచనములు పల్కుడు.

కదలె కదలె శక్తి రథము
కదలె ప్రజాశక్తి రథము.



శ్రీ గోపాలకృష్ణ శాస్త్రి, కనకదండి

షష్ట్యంతములు

చీనా కృతఘ్నులకు
సేనా శతఘ్నులకు

సర్వశుభమోచనము! మోచనము! మోచనము!
సర్వజననాశనము! నాశనము! నాశనము!

తన తాన సరికాక
తరములను సరిచేయ
తోడి నరులకు బుద్ధి
వేడి మాటలఁ జెప్పు
గడ్డితిను నెడ్డెలకు
మడ్డిగొను గొడ్డులకు
వక్రగతి చక్రులకు
నక్రమతి శుక్రులకు
శతృకృత మిత్రులకు
చిత్రిత చరిత్రులకు చీనా

దిద్దుకొన లేక యిలు
హద్దులను మీర జని
నమ్మించి కను బ్రామి
ఇమ్ముగా దోచుకొను
దొంగలకు బుంగలకు
కొంగలకు దుంగలకు

క్రుద్ధహాత బుద్ధులకు
విద్ధశత వృద్ధులకు
యుద్ధరస సిద్ధులకు
రుద్ధమతి శుద్ధులకు చీనా॥
ధర్మముగ దరిఁజేరి
మర్మములఁ దెలిసికొని
కలిసి కలియని యటుల
కలగలసి నటియించు
హీనులకు మీనులకు
దీనులకు పీనులకు
మత్తజన వృత్తులకు
విత్తపరి వృత్తులకు
కృత్త నివృత్తులకు
చిత్త విచ్చిత్తులకు
చీనా కృతఘ్నులకు
సేనా శతఘ్నులకు
సర్వశుభ మోచనము ! మోచనము ! మోచనము !
సర్వజననాశనము ! నాశనము ! నాశనము !



## శ్రీ చిన్నికృష్ణశర్మ, దేవరకొండ

విక్రమింపుడు భారత వీరులార !

మందలుమందలై పిటికిమందుల చీనిశశమ్ము లిప్డు రా
త్రిందివముల్ హిమాద్రి విడిదింబలెఁ గైకొని దండయాత్ర
యందొడఁగెం బ్రతిక్షణమునందుఁ బ్రతీక్షణ మింక జెల్లునే
ముందడుఁగై ఎదుర్కొని సమూలముగా బలిగొండు వైరులన్.

అదె శాంతిప్రియుఁడైన జవ్హారు ప్రధానామాత్యుఁడేయుద్ధవి
య్యది దుర్వార మటంచుఁ జెప్పెనుగదయ్యా! జాల మింకేల? శ
త్రుదళంబున్ విదళింపఁగాఁ జనుఁడువీరుల్ భారతీయుల్ మహో
గ్ర దవాగ్నుల్ రిపుకాననాళి కని లోకఖ్యాతి సాధింపుఁడీ!

మనది సత్యంబు మనది ధర్మమ్ముగూడ
మనది సకల ప్రపంచాభిమాన మైన
నింక విజయంబు మనది గా కెట్లు వోవు
విక్రమింపుఁడు భారతవీరులార !

శ్రీ జాషువా, జి.

## పారాహుషార్

ప్రతినంబూని భయంకరంబయిన శౌర్యజ్వాలలై లేచి, భా
రత చండీశ్వరి కోటికంఠముల నార్భాటించి, లంఘించి, ప్రో
న్నత చీనా విషకాసురుని కంఠంబుం విదారించి, శా
శ్వతకీర్తిన్ ఘటియించుగావుత ప్రపంచం బద్భుతం బందగన్.

కాసెబిగించి లెమ్మదె, యకారణ వైరము లేపినాడు, చీ
నాసురు డాక్రమించుకొనినా డిరుమూరు పురాలు భారతాం
బాసుత! మంత్రతంత్రములు పారవు, క్రూరవిరోధి రక్తమున్
దోసిటబట్టి త్రావుట యథోచితపూజ భూమీ సవిత్రికిన్.

చేసినబాస తప్పి పెరసీమల భూములపాలు చేయు ట
భ్యాసము చేసినట్టి నరు లా చయనీయులు; వారితోడ సా
వాస ముపద్రవంబు నవభారత వీరుల ధర్మనిష్ఠయే
బాసటగాగ, శాత్రవ కపాల పరంపర వ్రక్కలింపరా!

చివ్వకు గాల్ద్రవ్వెడు నా। చెవ్వెనలై కింత బుద్ధిచెప్పక మనవా
రివ్వలికిరారు, చీనా మువ్వన్నె మెకాల కాలమున్ దాపయ్యెన్.



శ్రీ జోగారావు, యస్వీ

## ప్రస్థానం

పద పదరా భారతవీరా
పథమంతా నీ వశమేరా ॥పద॥

ఇది భారత శివ జటాజూట
హిమ వన్నగ శిఖరి!
శిఖరోపరి ముఖరిత రంగత్తుంగ
తరంగిత గంగాలహరి!

ఇది హరిద్వార మిది హృషీకేశ
మిది బదరీవన మిది నైమిశసీమ!
మన మానసహంసధ్వని ధామ!

ఇది భారత జనయిత్రి కిరీట
కోటీర హీర కిర్మీరిత కాశ్మీరధరిత్రి!

ఈ మంచు మల యంచున
పొంచిన పొగమబ్బు నిల్చున?
నీ శౌర్య ఝుంఝుకు తూలి
నీ ధైర్య గిరి మోలిల వ్రాలి
కన్నీరు కార్చవలె
మున్నీటి మూర్ఛవలె.



## శ్రీ జ్ఞానానందకవి

### సమరాహ్వానము

రారండోయి యఖండ పౌరుష గుణ
ప్రారంభ భాగ్యోదయ
శ్రీ రాజన్నవవీర భారత పురం
ధ్రీ పుత్త్రికా పుత్త్రులా
రా! రంహస్సున దుర్నయుండు 'చయినా'
రాకాసిఁ జక్కాడఁగా
శ్మీరారంభక సైతవాంత వసుధా
సీమాస్థ సంతానమా!

జగతీచక్రి ప్రశంస లందిన యహిం
సా వాది బాపూజి ధ
ర్మ గుణైకోజ్జ్వల మార్గమందుఁ జని సం
పాదించుకొన్నట్టి పే
రొగి మీ గొప్పదనానకు న్నిలయమై
యొప్పున్ సమీచీనమై
పగలం బెంచిన దుర్జనుండు 'చయినా'
వాని న్నిరోధింపుడీ.

పంచప్రాణములన్ దెగించి యెముకన్
బాధించి వేధించు పెన్

మంచు గొండల శీతలాధికతకున్
రవ్వంత లెక్కింపకన్
కించిన్మానవు లౌ నరాతిజన వ
క్రీభూత దౌష్ట్యాలు ఛే
దించెన్ భారతవాహినుల్ గదలి మీ
దే ధర్మయుద్ధం బగున్.

ప్రిమథాధీశునితో సవాలు నొనరిం
పంజాలి నా డొక్క దు
ర్దమ బాహాపటు శక్తిశాలి, హాడలె
త్తం జేసె సచ్ఛక్తియై
యమునిన్ గొండొక పుణ్యశాలిని మగం
డాయుప్రిమాణంబుతో
డ మనన్ భారతవీర విప్లవపు ఘ
ట్టా లివ్వి జైకొట్టుడీ.

పేచీపెట్టి యశాంతిరేపి ధరతో
ర్వీం జుట్టి ముట్టాడగా
లేచెన్ దుష్టవిరోధి తండములు లే,
లే, లెండు మీ సాహస
ప్రాచుర్యంబులుఁజూప వేళ యిదె యా
రా! భీషణోన్మాద పై

శాచిం జింపగ దిగ్దిగంతములు మె
చ్చున్ దీక్ష గైకొం డహో !

కైలాసాచల శృంగసంగతుడు దు
ర్గా ప్రాణనాథుండు జే
జేలం దన్నిన చంద్రశేఖరుడు ర
క్షించున్ మహాభారత
క్ష్మాలక్ష్మీ విజయైక చిహ్నిత శుభ
స్వచ్ఛ స్వతంత్ర ప్రథా
శ్రీలన్ నాట్యకళా కలాపుడు శివ
శ్రీమూర్తి కల్పాంతమున్.

దీక్షాకంకణ ధారులై భరత ధా
త్రీ మాతృ మాంగళ్య సం
రక్షా దీక్షితులార ! యీ భువనముల్
శంసించు మీ త్యాగపున్
దక్షత్వమ్మును కేటి కోళ్లు జగదానం
ద ప్రభూతమ్ము మీ
యక్షయ్యంపు స్వతంత్ర జీవనకథా
వ్యాజైక సిద్ధాంతముల్.

సాగండోయి విశాల భారత జన
స్వాతంత్ర్య సంస్థాపనా

శాగంభీర మనస్కులార! హృదయా
జ్ఞాతమ్ము పొంగార ను
ద్వేగోద్విగ్న మనస్కులైన 'చయినా'
విద్వేషణారంభముల్
వ్రీగన్ శాంతి రసైకభావములు పృ
థ్వి న్నిండ నశ్రాంతమున్.

కదలండోయి యువక్ర విక్రమ రసై
క స్ఫార విస్తార సం
పదకుం బట్టగునట్టి భారతజన
మ్మా! దుష్ట వైధేయులన్
తుదముట్టింపగ మీ ప్రయత్నములు శ
క్తుల్ నింపి గెల్పించెడిన్
ఇదె స్వాతంత్ర్య పథానకుం దెరవు కా
దే? లెండు యోధాగ్రణుల్.



## శ్రీ నారాయణరావు, కాళోజి

*కలము కుంచె కదలాడెను*

పగటి దొంగ సమూహాల
పొగరణచెడి మొనగాడా!
సరిహద్దును కాపాడే
సైనికుడా! వినుము వినుము

కొండచాళ్ళ మంచుమీద
కొంకర్లుపోవు చలిలో
వీరోచితముగ నీవు
వైరులతో పోరుచుండ

అష్టపదుల జావళీల
ఆలాపన మాని నేడు
గళము కూడ రణ దుందుభి
కళల బూని పాడుచుండ

కలము కుంచె కులమువారు
కామిని చేలాంచనముల
కదలించెడి దొంగచాటు
కలలే చిత్రిస్తారా ?

వాల్జడలో నల్లతాచు
వాలకమును కను కనులకు
ప్రాకారము ప్రాకివచ్చు
పన్నాగము లగుపడవా ?

క్రిగంటి చూపులకే
క్రిందుమీదులౌ యెడదలు
పగబూనిన కోరచూపు
దగడుల గమనింప లేవా ?

'నిగా' బెట్టి వగలారుల
'దగా' లెన్ను చతురులకు
పంచతంత్రి కుతంత్రాల
వంచన 'అంచన' లేదా !

శీతకరునిచే నిప్పులు
చెరగించెడి మాంత్రికుల
శివుని కొసరు కంటిలోన
చిచ్చును రగిలింపలేరా ?

కుసుమాలకు కూడ అమ్మ
కొసల పదును పెట్టువారు
కలమును కుంచెను మెత్తని
కత్తి జేసి వాడలేరా ?

వాత్స్యాయన నిగూఢాల
వాస్తవ మెరిగిన ఘనులు
వర్తమాన పరిస్థితుల
స్వరూపాల నరయ లేరా ?

తంజావూరి రాజుల
తరహా లాలస మాని
సమయోచిత వీరావే
శమును బూని పూనింపక

కలము కుంచె కదలాడెను
గళము తోడుగా పాడెను

సుఖ లాలస కని పెంచిన
'నఖరా'లను మాని జనము
జాతి రక్షణార్థము తగు
రీతిగాను సాయపడగ కలము॥

కొండచాళ్ళ మంచుమీద
కొంకర్లుపోవు చలిలో
కండ బలమునకు తోడుగ
గుండె బలము చేకూర్చగ కలము॥

నేల కాళ్లు నెరయదన్ని
నింగిముట్ట తల నిగుడ్చి
అస్తాద్రిని ఉదయాద్రిని
అంటగ బారలు సాచగ కలము॥

అన్నలమని అప్తులమని
తిన్నగ సరిహద్దుదాటు
ఆతతాయి సమూహాల
నాపి హెడలుగొట్టుటకని కలము॥

ఆంధ్రావళి అండదండ
అసాముకు అందింపగ
నయ్యర్లకు తోడ్తోడుగ
నాయర్లను నిలిపివుంచ కులము॥

బదరీనాథుని రక్షకు
మధురను కంచిని కదుపగ
కాశ్మీరమునకు జంటగ
కన్యకుమారిని నిలుపగ కలము॥

బిహారీల రణభేరిగ
మహారాష్ట్రము హుంకరింప
గురుగోవిందుని గర్జన
ఘూర్జరులను కదలింపగ కలము॥

కర్నాటక చాముండియె
కలకత్తా కాళి కాగ
కైలాసము పిలుపును విని
కాకతి చిందులు త్రొక్కగ కలము॥

జారాహుట రక్షణకై
భద్రకాళి తలయెత్తగ
రెంటచింత మంట లెగసి
మింటి మంచు మండింపగ కలము॥

ఉత్కళీయ ఉత్సాహము
ఉత్తరాన్ని ప్రోత్సహింప
పడుకొండ లెలుగెత్తుచు
హిమవంతుని పురికొల్పగ కలము॥

గంగోత్రీ పావిత్ర్యము
వంగీయులు కాపాడగ
బ్రహ్మపుత్రి రక్షణకై
పంజాబీ పరుగులెత్త కలము॥

శ్రీనగరము చేయూతకు
శ్రీరంగము ఎగిరి దుముక
శ్రీశైలము గంతులిడుచు
శీతనగము నాదు కొనగ కలము॥

బొమిడిలా పరిసరాల
బొబ్బిలి పెడ బొబ్బలిడగ
లద్దాఖును చేరి కాయ
పుదుచ్చేరి కదంతొక్క కలము॥



శ్రీ నారాయణరెడ్డి, సి.

## క్రొవ్వెక్కిన చైనా

వెన్నవంటి భరతజాతి
వెన్నున నిప్పంటించిన
దెవ్వరు ? నువ్వేనా !
క్రొవ్వెక్కిన చైనా !

ఎదరొమ్మున బాకు రువ్వి
యేమెరుగనిలా దిక్కులు
చూచు నంగనాచీ !
ఛీఛీ విషవీచీ !

నమ్మికొన్న నేస్తకాని
నాడులు తెగనరుక నెంచు
క్రవ్యాదుడ వీవు; గోము
ఖవ్యాఘ్రం నీవు!

సామ్యవాద మను పేరిట
సామ్రాజ్య పిపాసదీర్చ
నెంచు కుటిలజాతీ !
ఇదా రాజనీతి ?

సరిహద్దుల తగాదాల
బురఖాలో ద్వేషవిషం
బుసకొట్టెనులేరా ! నిను
పసికడితిమి పోరా !

పక్కయింటి ద్వారానికి
పచ్చతోరణాలు చూచి
కళ్ళుమండె నీకు; నీ
కథ తెలిసెను మాకు.

తిండికి సరిపోకుంటే
తిరిపె మెత్తుకోనుంటివి;
జనం పెరిగితే మిత్రుల
శరణు వేడుకోనుంటివి.

తోటిదేశమున చొరబడి
దురంతాల కొడిగట్టే
బూజుబుద్ధి తగదుర! చెం
గీజుఖాను సోదరా!

భాయీాయని బుజముదట్టి
చేయిచేయి కలిపినట్టి
గడియ మఱతువేమి? బుద్ధి
గడ్డితిన్న దేమి?

భరతజాతి సత్త్వమ్మును
పరీక్షించబోకుము; అది
సహనానికి పలిక! ఈ
సమరానికి కాళిక!!

—o—

## శ్రీ నారాయణాచార్యులు, పుట్టపర్తి

### 'కదనమందున ధర్మము దేలిపోవలెన్'

తమవారన్న విమోహలేశము మదిన్
దట్టాడి, సుక్షత్రి ధ
ర్మము నెగ్గించిన వాసవాత్మజుని యు
న్మాదంబు బోకార్చి, యు
ద్ధము సాధించిన పుణ్యపూరుషుడు గీ
తాచార్యు డీనాడు, చ
క్రమునున్ దానుగ నొంచు మాకెలన సా
క్షాత్కారమున్ జెందుతన్.

పారమ్యంబులు ధర్మబోధలకు 'నీ
షా' ప్రాంత నిర్వాణ బౌ
ద్ధారామంబులు, శాత్రవాసుర మహో
హంకార హుంకార ధా
రారీఢంబులు, వీరభారత కుమా
రా! ధర్మ చక్రంబు, నీ
పారంపర్యము, దూకవన్న విమత
ప్రారంభ దావాగ్ని వై.

జవహరు పండితుండు, నర
జాతికి మౌళి విభూషణంబు, తత్
ప్రవిమల శాంతి వాదము ని
రాదృతి జేసి, వివేక మూఢులై

భువన భయంకరంబయిన
  పోటున కొగ్గిన వారి దీర్చుచే
సవనము, తద్విధా పరులు,
  జచ్చియు నిల్తురు కీర్తి కాయులై.

అంగదలెత్తి ధర్మమున
  కాతుహినాద్రులు "ఫాహియాన్" "హియాన్
సాంగులు" దాటివచ్చి; మన
  సన్నిధి గొల్చిరి; వేల యేండ్ల స
త్సంగతి దుమ్ములోఁ గలిపి,
  దానవులైఁ బడవచ్చు నీచులన్
భంగము సేయకే నిదుర
  వచ్చునె! దుర్దమ మార్య జాతికిన్.

పాణిపదమ్ము మాకు హిమ
  వంతము; మా కథలెల్ల తద్యశ
స్నాన పునీతముల్: విమత
  సైన్య పదార్పణ కిచ్చగింతుమే
మానము పోవనింక కను
  మాలపు జీవనమేమి శాంతిసం
ధానము సాగిరాదు కద
  నంబున ధర్మము దేలిపోవలెన్.



శ్రీ పద్మనాభస్వామి, యామిజా

## వీ ర భా ర త ము

మంచుంగొండ యటంచు, నెంచితొ హిమ
క్ష్మాధ్రింబు నీ గుండెలన్
దించున్ బాశ్చాత్యన యోగిపుంగవ తపో
గ్ని జ్వాలలన్ గాల్చి, భ
క్షించున్ నాటి కపర్ది జేతచటులా
గ్ని స్ఫారరోషచ్ఛటల్
నించున్ నీపయి నిష్ఠురాశుగములన్
జేకొట్టి చైనీయుడా!

మింటిని మంట కేకమయి
మీర హరోం హర సింహగర్జనల్
కంట మిణుంగురుల్ చెదర
గా నదె భారత వీరసైన్యమున్
దంటతనాన ముందడుగునన్
బడనున్నది దారుణాస్త్రముల్
గెంటగ నిన్ను; నీ గురుని
కిన్ వినిపింపుము నీదు దుస్థితిన్.

దురహంకార విముగ వర్తనము సై
దోడై నినున్ లేప ని
ష్ఠుర మాయాకవచంబు తొడ్గి కరుణా
శుంభద్గ్రహేంద్రింబుపై

నరకన్ జూచిన శ్వానమైతి; విది ఓ
హో ఎంత కైలాటమో !
భరమౌ సుమ్ము, గజేంద్రి ముగ్రిమయినన్
పాహ్రిణావన మ్మా పయిన్.

సరసుల్ సత్యపరాక్రమక్రిము లహిం
సా ధర్మ సద్వర్తనుల్,
కరుణామూర్తులు భారతీయులని లో
కం బేకమై సంస్తుతుల్
నెరపన్ మెత్తనివారలంచును మదిన్
నీవెంచి యీ వంచనన్
కరమున్ జూచుట కారుచిచ్చుపయి తొ్రి
క్కం జూచుటే యౌనుతే !

పండిట్జీ జవహార్ ప్రిధాని కరుణా
బంధుండు కుర్దుండునై
గాండీవంబు ధరించినాఁడు, జలధుల్
గర్జించు నుద్రిక్తతన్
కొండల్ చెండులుగాఁగ, దిగ్గజ శిరః
కూటంబు మాటాడ, నీ
గుండెల్ ప్రీలగ; ఆత్మరక్షణము నీ
కున్ సాధ్యమే యీపయిన్ ?

భారత ధర్మబోద్ధలు కృ
పారస ముగ్గొగ నీదుజాతికిన్
నేరుపుమీర నేర్పిరి, వి
నిర్మలశాంతగుణంబు దానికిన్.
వేరుగ నీవు చూపినది
నిష్ఠుర తాయుత వక్రబుద్ధి
వౌర! ప్రజావినాశకుడ!
వైతివి నీ తెలి వారిపోయెనే!

భారతవీరగాథ రిపు
వర్గ హృదంకుశమై చెలంగె, నె
వ్వారును నెత్తిపై కరము
వైచిన వారలు కానరారు, నీ
తీరున నూరకే యెగసి
దిగ్గున నేలకు డిగ్గ జూచితే!
మూరకు బార వైవగను
మోమెటు చెల్లెర నీకు దుష్టుడా!

నెత్తురు ద్రోవువాడ వయి
నెత్తికి కుంపటి నెత్తజూచితే!
పొత్తును జూపుచున్ భరత
భూమికి ద్రోహము చేయజూచినన్

మిత్తికి భృత్యువౌట సుమ,
మీదు నెరుంగక కత్తిదూసితే !
జిత్తులు సాగవింక నిను
"ఛీ" యని రావలి తెల్లవారలున్.

రంతుల్ మానర భారతాక్రమణ మా
రంభించి యీపాటికిన్
గంతుల్ మానర భారతాధిపతితో
కయ్యానకున్ రేగుటల్
సంతాపంబునకే యటం చెరుగరా
సయ్యాటలా దంతితో
క్రింతల్ దూరు విధంబు మానర, జగ
త్కళ్యాణ మాసింపరా !

రక్షోనైజగుణమ్ముతో రుధిర సా
మ్రాజ్యాభిషేకమ్ముతో
అక్షు లోమ్రడ్చి చరింప జూచితివె సిం
హాకారు డౌ జవ్వారున్
వీక్షింపన్ దర మౌనె నీకిక; ఎవో
నీకున్న ఆ ఆయుధాల్
రక్షింపన్ గలవంచు తుళ్ళకుము ! పీ
రమ్మన్య ! చౌఎన్‌లయీ !

మారణకాండమే సలుప

మా జవహార్బుధు డెంచెనేని, యీ

ధారుణి దిర్దిరం దిరుగు

తప్పను వార్ధులు పాదులెల్ల, హా

హా రవ ముప్పతిల్లును ది

శాల గణమందు మహీధ్రవర్గముల్

భోరన వ్రీలు నీ వలయు

మున్ గననెంచితె చౌఎనూలయీ !



## శ్రీ పాపయ్యశాస్త్రి, జంధ్యాల

### సైనికుని ఉత్తరము

ఓ నా దేశప్రజలారా !
ఉభయకుశలోపరి.

ఉత్తరం వ్రాస్తున్నా
ఉత్తరం ఇదిగో మరి.

కరాళమృత్యు దంష్ట్రాం
కురాల చాటునుంచి
గంగా యమునా బ్రహ్మపుత్రలు
జన్మించిన చోటునుంచి
ఉత్తరం వ్రాస్తున్నా
ఉత్తరం ఇదిగో మరి.

అత్యంత అమూల్యమైన మానవత్వాన్ని
ఆమూలాగ్రం నాశనం చెయ్యాలని
ప్రత్యేకం పనికట్టుకున్నారు పాతకులు
సత్యాన్ని ప్రేమనీ శ్రద్ధనీ
హత్యచేస్తున్నారు కిరాతకులు.

ఇద్దరినడుమ సరిహద్దులకోసం
గ్రుద్దులాట కానే కా దిది
సమస్త విశ్వశాంతిని
సవాలుచేసే జటిలసమస్య ఇది.

కుక్కల్లా లెక్కకురాని
దిక్కులేని చావు చావటమో
జయించి జీవిత పరమార్థాన్ని
మహిమాన్వితం చేయటమో
రణంగాదు రణం కాదిది
రామకార్య నిర్వహణం.

బ్రతుకో చావో పవిత్రజాహ్నవీతీరం
స్వామి కార్యనిర్వహణం క్షణభంగురం శరీరం.

దేనికిలే పేరు తమ్ముడూ
సేనొక సైనిక వీరుణ్ణి
దీనురాలైన ఒకానొక
వితంతువు కుమారుణ్ణి
బ్రతుకు గతుకుల్లో
ప్రాణాలు బిగబట్టుకొని
అమ్మ పెంచింది నన్ను
అరచేతుల్లో పెట్టుకొని
కరిగి నీరైన కన్నతల్లి
నిండుగుండెల కన్నీళ్ళతో
పెరిగి పెద్దయినాను
చిరిగిన నిరాశ పాత్రిళ్ళలో.

గ్రామం పేరు ఏమంటున్నావా భాయీ!
భారతభూమిలోని గ్రామాలన్నీ
ఒకేలా నాకు కనిపిస్తాయి.

సన్నని సందులు సావిళ్లు
తిన్నని ఎద్దుబండ్లు
కన్నుల విందుచేసే
చిన్న చిన్న పూరిండ్లు—

పైరుపొలాలు, పంటకుచ్చెలలు
పసిడికంకుల కళకళలు
పడుచు లంగా కలంకారీ
అలంకారాల తళతళలు—

సంధ్యారుణ కాంతుల్లో స్నానంచేస్తూ
'అంబా' అని అరుస్తూ
కోడెదూడను నాకుతున్న
గోమాత కన్నుల మిలమిలలు—

ఈ కందకంలో పడివుండి
ఈరోజుకు మూడురోజులు
రగిలే పొగలు, పగిలే బాంబులు
మండే మంటలు, మృత్యుదేవత
నీలినీడలు పారాడే గుంటలు.

జామునేపునుంచీ వాతావరణం
కొంచెం శాంతంగానే వున్నది

సైనికులభాషలో శాంతికి
'మరే' సరైన అర్థం ఏ మున్నది?

ఎవరివో ఆర్తధ్వనులు
చెవులు బ్రిద్దలుచేస్తున్నవి
దొంగతోడేళ్ళ రంగు గడ్డాల
బరబరలు వినవస్తున్నవి.

ఎముకలు కొరుక్కుతినే చలిలో
కాళ్ళుచేతులు కొంగర్లుపోతున్నవి
రక్తం గడ్డకట్టింది,
దృష్టి స్తంభించిపోయింది.

ఎదలో వెచ్చవెచ్చగా
మెదలుతూ పదేపదే గుర్తుకు వస్తున్నవి.

దూరానవున్న కన్నతల్లి
చల్లని మమతా-
అనురాగమయి అర్ధాంగి
తియ్యని అమాయికతా-

పిట్టల కిచకిచలలో
కిలకిలనవ్వే పాలబుగ్గల
చిట్టిబాబు చిన్నారి పెదవులజతా-
ఎదలో వెచ్చవెచ్చగా
మెదలుతూ పదేపదే గుర్తుకు వస్తున్నవి.

కనిపిస్తున్నవి. అవిగో
అమ్మ కనికరపు కళ్లు
జలజల కారుతున్నవి
నులివెచ్చని కన్నీళ్లు
పొర్లిపోతున్నవి గుండెలు
తడిసి ముద్దైనవి చెక్కిళ్ళు.

ప్రక్కనున్న పంచాయతీ రేడియో
ఒక్కటే ఆమెకు తోడు
అక్కడే కుక్కిమంచంలో
అమ్మ పడుకున్నది నేడు

మింటి ముంగిట్లో మిలమిల మెరుస్తున్న
ఒకే ఒక నక్షత్రంవైపు
అదేపనిగా పరుగెడుతున్నది
అమ్మ చూపు—

ఎవరైనా చెప్పండి అమ్మకు
ధైర్యంగా వుండమని
నా శిరస్సుపై ఆమె
ఆశీస్సులు కురుస్తుండమని.

అమ్మా! నీవు నిబ్బరంగా వుండు
నీ పేరు తలుచుకుంటూ నేను
ముందుకు నడుస్తున్నాను.

నరులకండలు కొరుక్కుతినే
రక్తపిశాచాల డొక్కలు చించుతున్నాను
బండలమీది బాది
ముక్కలు చెక్కలు చేస్తున్నాను.

ధన్యమైన నీ స్తన్యంమీద ఒట్టుపెట్టుకొని
గట్టిగా చెపుతున్నాను తల్లీ !
'వీరమాత' అనే బిరుదం
నీమెడలో హారంగా అలంకరిస్తాను.

రణరంగంనుంచి తిరిగి
ఇంటికి రాగలిగితే—

నీకాళ్ళు కళ్ళకద్దుకొని
నీచేతులు ముద్దుగొని
నీ పాదధూళి మౌళిపై
పులుముకొని పులకించిపోతాను.

లేదా తల్లీ !
కన్నతల్లి గౌరవానికిమాత్రం
కళంకం తీసుకురాను.

ఎవరు నీవు ?
అమ్మపక్క నిలుచుండి
అశ్రువులు రాలుస్తున్నావు ?
ఎందుకలా వెక్కివెక్కి ఏడుస్తావు ?

క్షణక్షణం కరిగిపోతూ
జ్వలించే మైనపువత్తిలా—
ఝుంఝూమారుతానికి
చలించే రావాకుతి గుత్తిలా—
దురంత దుర్దినం దురా
క్రమణలో నిరాశ చెందకు.
నిరంత నిస్పృహతో కుందకు.
నిబ్బరం గోల్పోకు
చింతాక్రాంతురాలివి కాకు.
మంగళమయమైన ఈసమయంలో
అమంగళంగా అశ్రు తరంగాలు
పొంగి పొరలనీకు
ఇది పూజాసమయం-వేళయింది
జగజ్జనని కాళికాదేవి
ఆలయంతలుపులు తెరువబడింది
అగరుధూపం అక్షతలూ తీసుకురా—
అసృక్ బిందుల చిందులతో తడిసి వికసించిన
అరుణకమలాలు కోసుకురా—.
కా దిది ఒకరిద్దరి సంగతి
యావద్దేశానికి సంభవించింది విపరీత విపత్కర పరిస్థితి
వందలు వేలు వీరసైనికులు నావంటివారు
పందెం వేసుకొని ముందుకువచ్చి పడుతున్నారు
పవిత్ర కర్తవ్య మహాయజ్ఞంలో

ప్రాణాలు ఆహుతి చెయ్యబోతున్నారు
పరమోత్కృష్టమైన ఇటువంటి అదృష్టం
బ్రతుకులో ప్రాప్తించటం ఎంతో కష్టం
అదేదో ఆవేదన గుబగుబ
లాడుతున్నది గుండెలసందున—
ప్రాణం పోయేముందు
ఒక్కమాటు నిన్ను చూడాలి—

పసుపు కుంకుమల బంగారుకాంతి
కెరటాలలో స్నానమాడాలి
ఆలోచనకు సమయంలేదు
ఆత్మార్పణానికి వేళయింది.

విశాలభారత విమోచన
వీరదుందుభి మ్రోగింది
విజయోత్సవం సాగింది.

ఏమా తల్లిం నీకు నామీద ప్రేమవున్నా
ఈమాత్రం తప్పకుండా చెయ్యాలి
మన బిడ్డల మనస్సులో దిక్కులేని వారమనే
దీనభావం తీసెయ్యాలి

వాళ్ళకు ఆత్మగౌరవం నూరిపొయ్యాలి
వాళ్ళు పెద్దవాళ్ళయి సగర్వంగా తలెత్తుకు తిరగాలి
వాళ్ళ నాన్న పేరు తలుచుకొని
వాళ్ళ దేహాలు నిలువునా పులకించాలి.

కరుణామయీ! కన్నీళ్లుతుడుచుకో
దుఃఖం దిగమింగు
కర్తవ్య నిర్వహణం-ఇది కఠోర పరీక్షాతరుణం
ఇంకేమీ అనుమానం లేదు.
నారీజీవనం నాటికి నేటికీ
ఇలాగే నడిచిపోతున్నది—
గుండెల్లో మండే దుఃఖ
జ్వాలలు భరించుతూ—
పెదవులపై చిరునవ్వులు చిందించుతూ—
పౌరుషపూర్ణమైన నా
ప్రతిజ్ఞకు హారతిపట్టు
పరువు నిలబెట్టు-భారత
వీరగౌరవానికి జేకొట్టు
నీ కన్నబిడ్డలకు నిప్పుతో
చెలగాటం నేర్పు
భావిభారత సంతానానికి మనం
పంచియిచ్చే బహుమానం
త్రివేణియై ప్రవహించే
శౌర్యం ధైర్యం బలిదానం.
వస్తాను-వస్తాను
తప్పకుండా వచ్చేస్తాను
మువ్వన్నెల విజయపతాకంలా
నవ్వుతూ ఎగిరివస్తాను.

గాండీవధరుని నరుని ప్రతిజ్ఞ
తాండవిస్తున్నది నా జిహ్వాగ్రాన
ఇక లేదు తిరోగమనం
సాగింది పురోగమనం

తెస్తాను-తెస్తాను
ముమ్మాటికీ తెస్తాను
విలువైన విజయోపహారం
తీసుకు వస్తాను

దురాక్రమితమైన దేశ గౌరవానికి
విముక్తి గీతం ఆలపిస్తాను.

ఇదుగో ఇప్పుడు జ్వలించిపోతున్నాను
హిమాచ్ఛాది శిఖరాలమీద
దేదీప్యమానంగా ప్రజ్వలించుతున్నాను
క్రమ్మిన అమావాస్య
చిమ్మచీకట్లను చీల్చివేస్తున్నాను

అచంచల సౌభాగ్యవతి
అమరభారతి అఖండజ్యోతికి
వేడినెత్తురు-అక్షయమైన
ఆజ్యంగా, అమోఘమైన
అర్ఘ్యంగా అర్పిస్తున్నాను.

మూలం : శివమంగళ సింహ
"సుమన్"

# శ్రీ ప్రసన్నాంజనేయులు, పాతూరి

జవాన్ స్వగతం

నన్నేనా పిలుస్తున్నది
సన్నద్ధం కమ్మంటున్నది ?
ఎన్నాళ్లకు నీ కమ్మని గొంతున
విన్నానమ్మా రమ్మను పిలుపును !

దేశం కోసం నీసందేశం
ధీరతతో నెరవేరుస్తా
ఇంకా ఈ యిల్లూ వాకిలి
సంకెళ్లను వదిలేస్తా !

హిమాలయాల్లో ఘనీభవించిన
మహాతపస్వుల మంత్రశక్తులే
నా ధ్యేయానికి ఎంతో సాయం
నాప్రాణానికి ప్రాణం - ఖాయం !

స్వాతంత్ర్య జ్యోతిని నిలుపగ
రక్తాన్నే ధారగ పోస్తా
రాబోయే తరాల వారికి
సర్వస్వం త్యాగం చేస్తా !

గజ గజ మని వణికించే
మంచు తెరలు కావమ్మా అవి
కళ కళ లాడే నీ దుకూ-
లాంచల రోచిస్సులు సుమ్మా!

జన్మభూమి - ఓ నా జననీ!
సౌభాగ్య, స్వర్గ సంధాయినీ!
జయహో శాంతి ప్రదాయినీ!
జయహో క్రాంత దర్శినీ!



శ్రీ బలరామాచార్యా, మడిపడిగ

## డ్రాగన్

మంచు కొండా వద్ద
పొంచింది డ్రాగన్
మరచి నిద్దుర పోక
పేల్చరా స్టెన్‌గన్ ॥మం॥

ఉండి ఉండీ పైకి
ఉరికి వచ్చునురా !
గుండు దెబ్బతో దాన్ని
కూల్చి వేయుమురా ! ॥మం॥

నల్ల మందును మెక్కి
నక్కి యుండెనురా !
బుల్లెట్లతో దాన్ని
పూడ్చి వేయుమురా ! ॥మం॥

మురిగి పోయిన కాలు
నరికి వేయుమురా
కుళ్ళి పోయిన దెపుడు
మళ్ళి పూయదురా ! ॥మం॥

## విశ్వాస ఘాతుకం

ఓ రోరి నేస్త గాడా !
ఘోరాతి ఘోర
క్రూరాతి క్రూర
నేరాల మారీచుడా ! ॥ఓ॥

మంత్రాల తోడ నీవు
తంత్రాలు పన్నినావు
మంచిని వంచించావు
మము రెచ్చ గొట్టినావు. ॥ఓ॥

నీ నిలువు నిలువు విషబద్ధం
నీ పేరే పెద్ద "అబద్ధం"
నీ జీవితమంతా యుద్ధం
నీ చర్యలన్నీ విరుద్ధం ॥ఓ॥

మా దేశానికి వచ్చితివి
మర్యాద లెన్నొ బడసితివి
మధురాన్నములను మెక్కితివి
మాపైనె రాయి రువ్వితివి. ॥ఓ॥

—o—

## శ్రీ బాలగంగాధర తిలక్

త్రిశూలము

వివేకం :

నమ్మకు నవ్వలేని వాడిని
పువ్వులు చిదిమే వాడిని
బరిమీద వదలిన పాముని
చైనా వాడిని.
నమ్మకు హంతకుని యీాలని
గోతులున్న బాటని;
భోగందాని పాటని
చౌ ఎన్‌లై మాటని.
నమ్మకు మొసళ్లున్న సరస్సుని
మూర్ఖు డధ్యక్షించిన సదస్సుని
సినీతార వయస్సుని
మావ్ సేటుంగ్ మనస్సుని.

ధర్మం :

సరిహద్దు మాత్రమే అయితే
సరిపెట్టుకోవచ్చు నొకలాగ.

చిరకాలం కృషిచేసి మానవుడు
స్థిరంగా నిలుపుకున్న విలువల్ని
చెరపివేస్తానంటే, ఊరుకోవడ మెలాగ?
దేశానికి హద్దులూ, ప్రవర్తనకి ఎల్లలూ,
ఆవేశాలకి మితీ, కావేషాలకి పరిమితీ,
అవసరం మానవ సౌఖ్యానికీ, సఖ్యానికీ,
అందుకే అనాదిగా చరిత్రకి పునాదిగా
పొందుపరిచారు జాతికీ, వ్యక్తికీ స్వతంత్రం;
అందంగా, అందర్నీ,
సమంగా వాడుకొమ్మన్నారు.
అవి కాదని వాదుకు సిద్ధమయితే,
యుద్ధానికి కాలుదువ్వితే,
ఊరుకునే చవట యీ కాలంలో ఎవడు ?
ఉరుకుతాడు సింహంలా ముందుకి నరుడు !
చివ్వకు ప్రతిభారతీయుడూ ఒక కవ్వడి;
గవ్వకు మారడు శత్రువు వాడెవడైనా.
ఇకనుంచైనా చైనా బుద్ధిగా మెలగకపోతే,
కత్రికచంవంటి ప్రజాబలం కంఠాన్ని కోస్తుంది;
సకల ప్రపంచం సంఘటితమై ఎదురిస్తుంది;
మునుపటి వాళ్లంకాదు, ముసలివాళ్లం కాదు,
మొనతేరిన బాకులమై మోహరించి నిలుస్తాం!

సాహసం :

ప్రతిసోల్జర్ ఒక శతఘ్ని ;
ప్రతి పోరు డొక దవాగ్ని ;
ప్రతినబూని నిలబడు నిటారుగా;
బ్రతు కెందుకు స్వతంత్రం పోవగా;
ఇదే అదను పదును పెట్టు
పదేపదే యెద మొహదా,
మనదేశం, మన స్వప్నం,
మరచిపోకు! వెరచిరాకు!
మనిషికి ఒకసారే మరణం.



శ్రీ భాస్కరరావు, టి.

## ఎవ్వడురా

శివుడుండెడి కొండలపై
దవానలము ముట్టించిన దెవ్వడురా॥
నిదురపోవు సింగంబును
బెదరగొట్టి తట్టిలేపె నెవ్వడురా॥
పిరికితనము రుచి యెరుగని
భరతజాతి నదలించెడి దెవ్వడురా॥
హద్దుదాటి యిరుగు పొరుగు
పెద్దలతో గ్రుద్దులాడు నెవ్వడురా॥
ఉవ్వెత్తున గాలిమేసి
కొవ్వెక్కిన కొండచిలువ యెవ్వడురా॥
రువ్వి రువ్వి కొమ్ము విసరి
చివ్వకు కాల్దువ్వ పసర మెవ్వడురా॥
ఎవ్వని మాటేని వినక
నవ్వుల పాలైన కోతి యెవ్వడురా॥
తనకోసమె తనగోతికి
కనుగానక త్రవ్వుకొన్న దెవ్వడురా॥
ఎవ్వడైన నేమి, వాని
కొవ్వు కాచి కరిగించుట కర్తవ్యము॥
ఎవ్వడైననేమి, వాని
త్రవ్వి పూడ్చి పెట్టించుట కర్తవ్యము॥

## శ్రీ భీమన్న, బోయి

### విశ్వేశ్వరునికి హెచ్చరిక

ఎవరులోపల ? గడియబిగించుకొని, ప
రుండినాడవె, శివశివా, ఒడలుమరచి ?
భరతభువి నెత్తిమీద కుంపట్లు మండ,
గుబులుపుట్టుట లేదొకో గుండెలోన ?

"ఇల్లును వాకిలిన్ కలుగ,
దేర్పడ రూపము కూడలేదు, మా
యల్లున" కన్నదేయనుము,
అత్త ! పరాయిదె ? కోపమూనగా
చెల్లునె ? నీవు పోవగని,
ఛీ నరహాట్టులు నీదు అత్తవా
రిల్లును ముట్టడించిరి ! స
హింతువె ? పార్వతి నూరడించవే ?

అలిగివచ్చి కాశి నధివసిస్తివె కాని
హిమగిరీందుపుత్రిడన్న హితవులేదె ?
ఏది పాశుపతము ? ఏది త్రిశూలమ్ము ?
పారవైచినావె పాత్రితవచును ?

ధరణిన్ గల్గిన సర్వ మానవులకున్
తత్త్వామృతమ్మిచ్చి, ని
ర్జర తేజస్వుల జేసినట్టి హిమవత్
ఛ్ఛామదేవి రక్షింప నీ

పురుకంగావలెగాని—సాధనములే
        దో ? ముష్టి పిబూదిలో
పరమూణ్వాయుధ కోటి పుట్టదో ? రిపు
        వ్రాతమ్ము గోల్మాలదో ?

వేద వేదాంత సుధలుద్భవించె నిందు,
బ్రహ్మ విష్ణీశ్వరాశ్రియారామమిద్ది,
సర్వ చైతన్యశక్తి నీ సతికి వసతి
ఈ హిమాలయ శ్రేణి, రక్షించుకొమ్మ!

కాశిని వీడనక్కరయు
        కల్గదు; మేల్కొని, నీ లలాట స
ర్వ్యాశనభూతి కొంచెమిటు
        రాల్పుము; కైకొని, వీరభద్రులై
దేశములోని మేటి యువ
        తీయువ కోటి సమస్త చీనులన్
నాశముచేసి వత్తురు, ఘ
        నమ్ముగ నీ విభుతన్ భజించుచున్!



## శ్రీమతి మంజులత, డి.

### బంగారపు గాజులు

ఒకరోజున ఎంతో ప్రేమతో కొని యిచ్చాను
నీవు కోరిన బంగారపు గాజులజత ఒకటి!
ఆ తరువాత మళ్ళీ నేను నేటివరకూ
నీకేమి యివ్వలేకనే పోయాను !

నిజం చెప్పు చెల్లీ !
నీ సోదరు డిచ్చిన
ఆ బంగారపు గాజులు నేడు
నీ చేతులకు శోభను కలిగిస్తాయంటావా ?

నా ముద్దులచెల్లీ !
నామాట వినుతల్లీ !
ఆ గాజులను వెంటనే అమ్మివేసి
కొన్ని పౌనుల ఉన్ని కొని తీసుకరా !
మంచుకొండల భీకర శీతల వాయువుల్లో
నీ సోదరుల శరీరరక్తం
మంచువలె గడ్డకట్టుకుపోతున్న
ఈ విపత్కర తరుణంలో

నిజం చెప్పు చెల్లీ !
నీ సోదరు డిచ్చిన
ఆ బంగారపు గాజులు నేడు
నీ చేతులకు శోభను కలిగిస్తాయంటావా ?

అందుకే నా చిట్టిచెల్లీ!
ఆ గాజులను అమ్మివేయమంటున్నాను
అల్లడానికి వున్ని, సూదులు కొనమంటున్నాను!
నీవు కాలేజీకి ఈరోజున
వెళ్ళకపోయినా మించిపోయిం దేమీ లేదు
తక్షణం నీవు చేయవలసింది—
స్వెట్టర్లూ, మఫ్లర్లూ అల్లడమే!
పిచ్చాపాటి కబుర్లతో
కాలాన్ని వృధాచేయక
విలాసాలను విడనాడి
కాలపు విలువను గ్రహించు చెల్లీ!
నీ సోదరులు భయంకర శీతలంలో
పిస్తోలు, తుపాకిని చేబూని
పహ్యుడు, నీచుడు, రక్తపిపాసి అయిన
పశువులాంటి శత్రువుతో పోరాడుతున్నారు!
ఈ వీరులకోసం—
నా చిట్టిచెల్లీ!
ఈరోజు రాత్రి నీవు విశ్రమించకపోయినా
మించిపోయిన దేమీ లేదు
నీవుమాత్రం స్వెట్టర్లూ, మఫ్లర్లూ
అల్లి పంపించు తక్షణం!

గడగడ వణకించే చలిలో
నీ ప్రేమలోని వెచ్చదనాన్ని
దేశకోసం పోరాడుతున్న
నీ సోదరులు కొంచమైనా అనుభవించకపోతే

నిజం చెప్పు నా చిట్టి చెల్లీ !
నీ సోదరు డిచ్చిన
ఆ బంగారపు గాజులు నేడు
నీ చేతులకు శోభను కలిగిస్తాయంటావా ?

మూలం : దీపక్ గంగోపాధ్యాయ



శ్రీ మాధవశర్మ, పాటిబండ

## ఇందుకేనటోయ్ !

హిందీ-చీని భాయ్ భాయ్ అన్నా
ఇందుకేనటోయ్ మావన్నా !
హిందీ-చీని భాయ్ భా యన్నా
ఇందుకేనటోయ్ మావన్నా !!

కత్తంటే కర్షకుడన్నావ్ । సుత్తంటే కార్మికుడన్నావ్ !
కత్తీ సుత్తీ జగత్తుకు । కళ్యాణపు చిహ్నాలన్నావ్ ! హిం-చీ

సుత్తి పెట్టి మెత్తనివాళ్ళని
నెత్తిమీద మొత్తేస్తున్నావ్
కత్తి పెట్టి నమ్మిన మిత్రుల
కుత్తుక లుత్తరించుతున్నావ్ ! హిం-చీ

పంచశీల నుద్ఘోషించావ్ । మంచివాడవని నమ్మించావ్
కంచెకాడ తగవులు పెంచావ్ । మంచుకొండపై పదముంచావ్-హి

తీస్తావా లేదా పాదం ?
చేస్తావెందుకు పిడివాదం ?
వేస్తాం గీస్తాం లేదిక గెం
ఛేస్తాం నోరెత్తేవంటే ! హిం-చీ

నంగనాచిలా మా భూములు । దొంగిలజూస్తావా నేస్తం !
మ్రింగిన భూభాగంలో ప్రతి అంగుళమూ క్రక్కించేస్తాం! హిం-చీ

## శ్రీ రంగాచార్యా, దాశరథి

### పొంగరా జలధివై

మంచుకొండను మ్రింగ
వచ్చిందిరా చైన
కంచు కోటను కూల్చ
పొంచిందిరా చైన

పెంచరా నీ శక్తి
మించరా పగవాని
రగిలించరా అగ్గి
గుండెలో బండలో
వెలిగించరా జ్యోతి
చీల్చరా చీకట్లు
పట్టరా ఆయుధము
కట్టరా నడుము
పూనరా రౌద్రమున్
మానరా శమము
ఎత్తరా నీ జండ
ఒత్తరా శంఖమ్ము
పొంగరా జలధివై
మ్రింగరా అరుల
నింగిలో అశనివై
కూల్చరా గిరుల

ఈ నేల, ఈ రాలు
ఈ గనులు నీవిరా
ఈ నదులు, ఈ చేలు
ఈ శోభ నీవిరా
నీ తల్లి నెవ్వడో
చెరచగా వచ్చెరా
నీ ఇంటి నెవ్వడో
దోచగా వచ్చెరా
ఉరకరా తరుమరా
నరకరా వాని
త్రుంచరా పగవాని
పిండుల న్చెండుగా
పెరుగరా పొంగరా
ఉరమరా శూర
రుద్రరూపము దాల్చి
దుమకరా వీర
నిగ్రహము చాలురా
నింగినే చీల్చరా
ఆగ్రహము పూనరా
ముగ్గచ్చలం గూల్చరా !

——

# శ్రీ రంగాచార్యులు, బృందావనం

విజయరథం

చెలిమిగోరి చెయిజాచిన
స్నేహితునకె విద్రోహం—
విశ్వశాంతి నభిలషించు
వీరకోటి కపకారం—

కాలదోష మంటిందట
మెక్ మోహన్ గీతకు
మంచుమల ప్రతిధ్వనించె
పరఫిరంగి మ్రోతకు

దయమాలిన దానవగణ
తాండవ సంరంభం
అహంకృతికి చిహ్నముగా
అంధుని విజృంభణం

హిమాలయము చలించింది
సమాధాన మిస్తుంది
అంతిమ విజయాన్ని ధర్మ
మందుకొని హాసిస్తుంది.

ఇంటింటా జయగీతులు
ఘంటారావములు
వాడవాడలా సువర్ణ
వర్షమ్ముల ధారలు

ధర్మవీర సముద్ధతికి
తథ్యము జయమ్మురా !
కర్మభూమి నడుగిడుచో
ఖాయ మపజయమ్మురా !

ప్రత్యర్థుల నెదిరించి
ప్రత్యంగుళ మాక్రమించి
భరతమాతృ వందనం
నెరపును మన వీరగణం

మనదే ! ఆ విజయరథం !
కనవోయీ ! నవపథం !



శ్రీ రమణ, S. V.

## చైనా దురాక్రమణ

సాగిస్తోంది దురాక్రమణ
చైనాలోని పశుతత్వం
శాంతివున్న దేశంలో
చిచ్చు పెట్ట వస్తున్నది.

ఎవరెస్టూ, గౌరీశిఖరం
కబళించగ వస్తున్నది
అగ్గి చేత పట్టుకొని
ప్రజ్వలిస్తు వస్తున్నది.

మర ఫిరంగి చేతబట్టి
మంటగల్ప వస్తున్నది
మాడ్చివేయ వస్తున్నది
మసి చేయగ వస్తున్నది.

కరకుకత్తి చేతబట్టి
నరికివేయ వస్తున్నది
కొరివి చేతబట్టుకొని
కొరికివేయ వస్తున్నది.

ఇండియా ప్రభుత్వాన్ని
ధిక్కరించి వస్తున్నది
దిట్టనంచు వస్తున్నది
లెక్కచేయ కొస్తున్నది.

ఇండియాపై కొస్తున్నది
ఆక్రమించ వస్తున్నది
ఆగనంటు వస్తున్నది
హద్దు దాటి వస్తున్నది.

రణం రణం రణం అంటు
రంకెవేస్తు వస్తున్నది
ఉరకవేస్తు వస్తున్నది
యుద్ధజ్వాలను తెస్తున్నది.



## శ్రీ రాధాకృష్ణ, పరిగి

### జాతి గర్జన

ఛాయి ఛాయి అంటూనే
బల్లెం విసిరింది చైనా !
నీతులు వల్లిస్తూనే
గోతులు తవ్వింది చైనా

పెరిగిపోవు జనాభాకు
తిండి పెట్టలేక చైనా,
పచ్చని మన సిరిని గాంచి
పడింది మన పైనా !
చైనా కిదె హెచ్చరిక
దురాక్రమణ సాగ దిక !

రొమ్ము విరుచుకుంది జాతి
పొమ్మని గర్జిస్తోంది ?
గుండెల్లో వేడి రుధిరం
లావావలె ఉబుకుతోంది

కండల్లో చైతన్యం
నిండుగా నర్తిస్తోంది ?
సమరాంగణమున చిందే
ప్రతి రక్తపుబొట్టుకూ
వేనవేన శివాజీలు
ప్రాణాలతో లేస్తారు !

కుతంత్రాలు సాగించే
కుళ్లుపోతులార వినుడు
మా దేశం మేలుకొంది
మీ కపటం తెలుసుకొంది
"నీరోలం" కాము మేము!
"జీరోలం" కాము మేము!

పిరికిజాతి కాదు మాది
నరకుతుంది శత్రువు నిది
పదును బెట్టి ప్రబోధించు
చైనా గర్వాని అణచు

జాతిలో శక్తిని పెంచు
కార్మికుడా! కర్షకుడా!
ఓ కళాకారుడా
జాగరూకులు కండి!

జాగుచేయక రండి
మనపైన పడింది పిశాచి!
వీస్తున్నది విషవీచి!
మోగించాలి "రణభేరి"
పోరాడాలి హోరాహోరి!

మనవైపున్నది న్యాయం - మన నీతే మనకు సాయం
ముందుకు సాగాలి మనం - అందుకొనగ ఘనవిజయం.

—o—

## శ్రీ రామసోమయాజి, భమిడిపాటి.

### ఉరికించు రణభేరి

ఉరికించు రణభేరి ! ఉరిమించు జయభేరి !
చైనా దురాక్రమణ చండించు ! మండించు !

కండకావర మూడ; కైలాస మల్లాడ !
బుద్ధదేవుడె కత్తిబూని యుద్ధంబాడ !
కాళికాదేవి రక్తపుటేరు లీదాడ !
మొండిచైనా గుండె ఖండించు! మండించు ....ఉరికించు

నీకళ్లలో రామనేత్రాగ్ని మెరసింది !
నీవ్యక్తి వీరాంజనేయమై దూకింది !
నీమూర్తి రణరంగ భీమమై వెలసింది !
నీదండ జగమెల్ల నిలచింది తమ్ముడా ! ....ఉరికించు

చైనా మహారాక్షస కూ్రర దంష్ట్రిల;
చైనా దురన్యాయ చండాల పక్షాల;
చైనా దురాశా పిశాచ దుర్భావాల;
చైనా మసైనా, నుసైనా, విడంబోకు ! ....ఉరికించు

నక్క వినయాలతో, నమ్ర నాట్యాలతో,
ప్రబల గర్వమ్ముతో, ప్రక్క బల్లెమ్మాయె !
ఉపకారి కపకార మొనరించు చైనాకు,
పరువు బ్రద్దలగొట్టు బలియిమ్ము తమ్ముడా!....ఉరికించు

నీయాలుబిడ్డలే, నీతల్లిదండ్రులే,
నీదేవతలె శత్రు పాదాల జచ్చిరా;
బ్రతికినా నీకేమి పరువా? ప్రతిష్ఠయా?
శత్రువును చెండాడి, జయలక్ష్మి నేలుకో! ....ఉరికించు

ఉక్కుపాదాలతో త్రొక్కి, చైనాపీక
నొక్కినా, నిక్కి పైకెక్కినా, ప్రాణాలు
దక్కించుకొను ఘోరదాస్యమో? శత్రువుం
జెక్కి వీరస్వర్గ సీమనో! యెంచుకో! ....ఉరికించు

పడుపు బ్రతుకీడ్చినా గడవదన్నా చావు!
ఉడుకు నెత్తుటివేడి ఉడిపించి, జగమెల్ల
మెచ్చ చైనా గుండెజొచ్చి, బ్రద్దలు జేసి,
భారతీయుని కీర్తి పాలించు! మేలెంచు ....ఉరికించు

ధనమైన, బంగారు గనియైన, నీదేహ
బలమైన, దాచి పూజల నేయ దాగునా?
లోభించి కడకు సంక్షోభంబు జెందకే,
జయమందు రణభూమి, సర్వంబు నర్పించి ....ఉరికించు

కొల్లగొట్టే శత్రు కూటమే వచ్చెనా;
పాతిపెట్టిన నగలు, వజ్రాలు, సౌధాలు,
నీవారలెక్కడో నీవెక్కడో లోభి?
ముందె యర్పించి నీభూమి కాపాడుకో! ....ఉరికించు

## శ్రీ రామారెడ్డి, ముకురాల

### వహ్వా! ఎంత లాహిరి?

ఎంత లాహిరీ ఉన్నది చూడు !
ఎంత తడాఖా ఉన్నది చూడు !!

టుం టుం టుం టుం 'టుంగ్' 'టుంగ్'
తం తం తం తాం తల్లాఖ్ తల్లాఖ్
ఝుం ఝుం ఝుం ఝుం ఝుల్లాక్ ఝుల్లాక్
తదిగిణ గిణతోం తడాంగ్ వెలాంగ్
ధంపట్ ధంధం ధడక్ ధడక్ లధక్

ఎంత లాహిరీ ఉన్నది చూడు
ఎంత తడాఖా ఉన్నది చూడు

పంచశీల దస్కత్తుల తోడు,
పదను బెట్టిన కత్తుల తోడు.
నీ పప్పూ నా పొట్టూ కలిపెయ్,
ఉంది బొక్కుదాం చేతులు దులిపెయ్.
అందర మొకశే అల్లా తోడు,
అల్లం గలిపిన బెల్లం తోడు.

ఎంత లాహిరీ........
ఎంత తడాఖా........

మార్క్సు, స్టాలిన్ మహిమలె నిజమా?
బుద్ధుడు, మహమదు, బూర్జువ యిజమా?
టంకం కొడవలి టకటక జూడు,
తారా చంద్రుల తైతక జూడు.
యూరపు తోడు యు, యు, ఐ, ఐ,
తూరుపు తోడు 'తూ తూ మై మై.'

వారే వహ్వా
వహ్వా వహ్వా
ఎంత లాహిరీ........

ఝకఝం ఝకఝం
ఝంఝక ఝంఝక,
ఝకఝక తికమక.

కాశ్మీర్ శాలువ కిమ్మతు జూడు
ఖరీదు దారుల హిమ్మతు జూడు.
నల్లమందు ఖుల్లయ్యను జూడు,
నారాగడ్డం మియ్యను జూడు.

వారే వహ్వా
వహ్వా వహ్వా
ఎంత లాహిరీ........

రక్తపతాకా జాతీయత్వం,
తంగసానిలో పాతివ్రత్యం.

'అంబ పలుకు, జగదంబా పలుకు'
మూలనున్న ముసలవ్వా పలుకు.
బల్లి పలుకు, జంగు బిల్లీ పలుకు
'మావ్, మావ్'

జాతిద్రోహుల జాతీయత్వం,
జగ జంతులలో పాతివ్రిత్యం.

ఎడన వున్న యెల్లమ్మా సాక్షి
కుడిన వున్న గంగమ్మా సాక్షి
పొలిమెర పోలేరమ్మా సాక్షి
నంది సాక్షి, నాగన్నా సాక్షి
గుడ్, గుడ్, గుడ్, మూడు గుండ్లాటా ?
తమ్మి ! నీ యదృష్టమ్మాట !
వారే వహ్వా
వహ్వా వహ్వా
ఎంత లాహిరి ఉన్నది చూడు
ఎంత తడాఖా ఉన్నది చూడు.



# శ్రీ లక్ష్మణశాస్త్రి కప్పగంతుల

## సైనికోత్తేజికము

"జేష్యామః కుటిలాన్ హి కూటధిషణాన్ చైనీయ దుష్టాసురాన్
ఘోక్ష్యామో రిపుకోటికోటికరటాన్ శబ్దైః పటాపట్ కృతైః,
ప్లోష్యామోఽరివసారసాన్ చరుషు నీరంధ్ర స్వాహాస్త్రైష్వలం
ఖేలిష్యతి భారతధ్వజపటస్సత్యం హిమాద్రౌ భృశమ్॥

"మృగేంద్రపుచ్ఛసంగతా పిపీలికాగతి ర్యథా
క్షణే క్షణే ప్రచాలినీ కపీంద్ర శేముషీ యథా
జగన్నరాతిగర్హితా కునీతిశంకునిర్మితా
గతిర్హి చీనరక్షసో వికుంఠితా భవేత్ భృశమ్॥

"చీనో భయానకరసాకృతిర్గతోఽత్ర
వీరాకృతా భరతభూభటసంఘ ఏవ,
దీపే పతంగ ఇవ భారతసైన్య సంఘే
లీనో భవేదనుకలం నహి సంశయస్స్యాత్"॥



## శ్రీ లక్ష్మీనారాయణ, చర్ల

### హెచ్చరిక

ఆసియాపై ఆధిపత్యం
ఆశించి పెంచుకొని పైత్యం
మంచిచెడ్డలు మరచిపోయి
వంచనకు దిగినావా భాయీ ?

పెక్కు వేల యేండ్లనుండి
మిక్కుటమౌ ప్రేమతోడ
ఒక్కటిగా మెలగిన మా
ప్రక్కలోని పామైతివ !

అందరి స్నేహంబుకోరి
అభ్యుదయ పథము పరి
ముందున కడుగిడు మమ్ము
ముంచగ నెంచుట నీచము !

తరతరాల దాస్యముతో
తరగని మా శౌర్యములో
నివురుగప్పి నిప్పుందని
నిశ్చయముగ కాల్తుందని
నీకు నిజము తెలుస్తుంది
నీవంటివారికి పాఠమౌతుంది !

ప్రపంచమందు నీకు
ప్రతిపత్తిని గోరిన మాకు

వెన్నుపోటు పొడిచావు; నిను
వెనకేసు కెళ్ళినందుకుగాను,
దురాక్రమణ కాంక్షను మరగి
భారతీయులను తిరిగి
బానిసశృంఖలాల బంధించాలని
ప్రయత్నం చేసే నీవు
ప్రపంచంలో అవహేళన పొందుతావు।
వినాశకాలే విపరీత బుద్ధిః
విజయం నీదని విశ్వసించకు కుబుద్ధి.
ఫిరంగులంటే పెండ్లి బాజాలుగా
మోర్టారులంటే హార్టుకు ప్రియంగా
స్వేచ్ఛనుకోరి ఐచ్ఛికంగా
ఆహ్వానించే అసమాన వీరులు
శిక్షించే మా స్వేచ్ఛాభూమిని
భక్షించాలని భ్రమపడకు మదిని
నలుబదికోట్ల భారతీయులు
ఇలలోగల స్వేచ్ఛాప్రియులు
మా స్వేచ్ఛాజ్యోతికి రక్ష
దాని జోలికి వస్తే తప్పదు నీకు శిక్ష।

---

## శ్రీ లక్ష్మీనారాయణమూర్తి: శ్రీపాద

### చైతన్యము

దీవించి సమరధాత్రికి పంపుదువుగాని
కడుపుచల్లగ పుత్త్రు గన్నతల్లి !
ఆనందముగ మనోహరు నంపుదువుగాని
విమతుల బోదోత్రిల వీరపత్ని !
అలనాటి సత్యను దలపించెదవుగాని
రావమ్మ ముందుకు యౌవనాంగి !
జయహారతులు పాడి సాగనంపుదు గాని
నీ యన్నలను భారతీయ బాల !

దేశ గౌరవ స్వాతంత్ర్య దివ్యకీర్తి
సుప్రతిష్ఠలు కాపాడ; సుహృదులట్లు
చూచుకొన్న చైనీయులే దోచుకొనగ
బూని దండెత్తినారు నీ భూమిమీద.

కష్టించి పనిచేసి గడియించి పొదుపు చే
సిన పవిత్రంబైన ధన మొకింత
తర తరమ్ములనుండి తనువున దాల్చుచు
మురిసిపోయెడి స్వర్ణ భూషణముల
హుండీలు గ్రహియించి ఊరూరు నింటింట
తిరిగి వేడుకతోడ తెచ్చు సొమ్ము
ఎప్పుడో అనుటకై యిప్పుడే దాచిన
ఆహార ధాన్యాలయం దొకింత

దేశమాతకు కాన్కగా తీసియిండు
ఆయుధ బలమ్ముతోడ సంఖ్యాబలమ్ము
కూడ గలిగిన రిపులతో ఘోర సమర
సీమ నిలిచిన భారతసేన కొరకు.

అద్వైత దృష్టితో నఖిలమ్ము వీక్షించు
తత్వమ్ముగల ఆర్ష ధాత్రి మనది
గౌతమాశోకులు గాంధీ మహాత్ముండు
గరపిన శాంతిమార్గంబు మనది
పగవారలను బాధపడనీక కష్టింప
ప్రాప్తించు స్వాతంత్ర్య లక్ష్మి మనది
న్యాయసంరక్షణకై యనేకాజి రం
గంబుల నిలుచు ధైర్యంబు మనది

మాతృదాస్య విముక్తికి మహిత సంప
దలను త్యజియించి ఖైదులోపల గృశింప
సిద్ధపడు త్యాగమూర్తుల సేవ మనది
అన్ని విధముల ఘన విజయమ్ము మనది.

తనయులై యెల్లరు మనసు లోకులనుండి
భావింతురన్న భావంబు మనది
స్నేహాపూరిత పరిస్థితులలో చర్చించి
సామరస్యము గూర్చు సరణి మనది

ఏ కూటమికి చెంద నిచ్ఛగింపని సుహృ
త్తాటస్థ్యమును బూను బాట మనది
ఒక సూది మోపిన యుర్వియు నితరుల
దాశింపబోని మర్యాద మనది.

యెంతో శ్రమియుంపగా లభియించినట్టి
స్వేచ్ఛ నిల్పుకొనంగ సంసిద్ధులమయి
యెట్టి త్యాగాలనైన గావింపగలుగు
ధర్మమార్గైక దీక్షాపథంబు మనది.

మునుపు పద్మవ్యూహమున జొచ్చు నభిమన్యు
దలపించు శౌర్యము గల జవాను
ప్రాణేశ్వరిని వీడి బవరాని కేతెంచు
నా బాలచంద్రు నీడగు జవాను
గజగజ లాడించు గడ్డకట్టిన మంచు
లెక్కింపకుండ నిల్చిన జవాను
సంఖ్యాబలమ్మున్న శత్రు సైన్యాలకు
జంకక ముందుకు చను జవాను

కలరు మన సరిహద్దు రక్షణము సేయ
నచల దీక్షను బూను సైన్యమ్మునందు;
ఒక్క రొక్కరి సాహస మక్కజంబు
గొలుపు జగమెల్ల కీర్తి కాంతులు వెలుంగ.

కంఠమందలి మౌక్తికపు హారము నొసంగ
    నుబలాట పడుచున్న యువతు లిరుగో
కరకంజముల గలగలలాడు బంగారు
    గాజులజత లిచ్చు కాంత లిరుగో
పరిణయ చిహ్నగా ధరియించు నంగుళీ
    యకము లీయగవచ్చు నతివ లిరుగో
చెక్కులపై కాంతి చిందుచు కర్ణ భూ
    షణము లొసంగెడు చాన లిరుగో

ధర్మమార్గమ్ము వీడి యుత్తరపు హద్దు
మీరి వచ్చిన రిపుసేన బారద్రోలి
భావి సౌఖ్యాలు గౌరవప్రదపు బ్రతుకు
భారతీయుల కొనగూర్చు వ్రతముతోడ.



# శ్రీ వరదాచార్యులు, వానమామలై

వెడలు వెన్కకు

వెడలు వెన్కకు తిరిగి వెడలు చైనావాడ
బడితగల వానిదే పుడమి యను దిన మేగె॥ వెడలు॥

నిట్టి నీల్గెదవింక నీవె తప్పు నొనర్చి
బుట్ట జెడిపోయెనా బుద్ధి బూజెక్కెనా
ఎట్టి సైన్యము జూపి యేమొ బెదరించెదవు
కట్టిపెత్తనము సాగదు ఖబర్దారిచట వెడలు॥

ఎట్టిజెండా జూపి యిండియా పొగబండి
ఆపజూచెదవేమొ దోపిడీ జేయుటకు
ఆగబోదిది ముందు సాగిపోవును తనదు
సరిహద్దు దాటి నిను తరిమికొట్టెడి వరకు వెడలు॥

మెక్కితివి నలమందు తిక్క తలకెక్కెనా
పిక్కింటజొచ్చి పొగరెక్కి యిది నా దనెదు
కుక్కకాటుకు చెప్పుగొని బుద్ధి జెప్పుచే
చక్కనగు మందు నీ తిక్క చేష్టలకెందు వెడలు॥

కొండవళ్ళ గొడ్డళ్ళగొని పండ్ల నూరుచున్
హడలెత్త జేయ నీ యబ్బతరమే కాదు
ఊచకోతకు గటికపోచ లనుకొంటివో
వర భారతీయ జవహారు వజ్రకాయములు వెడలు॥

ఈ హిమాచల రాజ్యమెల్ల మాకాణాచి
ప్రాణమిత్రుముగాని దీని విడమో బూచి
శీతనగమిది భరతమాత మణిమకుటమ్ము
తల నిలిచియుండ నీ మలగొను టబద్ధమ్ము వెడలు॥

ధాత నుండియును మాంధాత కాలమునుండి
తాత తండ్రులనుండి తరతరమ్ముల నుండి
హిమనగమ్మిది మాది యింటిగోడ పునాది
కొని నీవు యిట త్రివ్వకొనకు నీదు సమాధి వెడలు॥

మా మాతృ ధాత్రికిది మల్లియల పూసరము
మా ఋషీశ్వరుల కీ మల తపోమందిరము
మా హృదయ కమలముల మానససరోవరము
మా మేఘసందేశ మహిత కవితాకరము వెడలు॥

ధరణిజను గొనజూచు నరభక్షకుని రీతి
ద్రుపద పుత్రిక నీడ్చు దుశ్శాసనుని భాతి
పరుల సొమ్ముల కాసపడకు మోరి కిరాతి
వారివలె నీ కొదవు వల్లకాటి విభూతి వెడలు॥

ఆరు పదికోట్లు మేమని విఱ్ఱవీగకుము
అస్త్ర శస్త్రము లున్నవని ముందు సాగకుము
ధర్మమే శక్తిమంతమ్మను ఋషి మతము
ధర్మపథ జయమ్ము తప్పదను భారతము

వెడలు వెన్కకు వెడలు చైనావాడ
బడితగల వానిదే పుడమియను దినమేగె వెడలు॥

## శ్రీ విశ్వం, అరిపిరాల

రాజీబేరం

హద్దుమీరిన అహంకారం
దేశాల హద్దుల్ని చెరిపేసింది.

విశ్రమించని దుర్నీతి
తీరని రాజ్యదాహంగా మారి
చైనాసుర వాహినిగా
హిమ శిఖరాన్ని ఒరసికొని
ఆర్యభూమిని ముంచెత్తింది.

ప్రకటించక చేస్తున్న యుద్ధానికి
ప్రకటించిన యుద్ధ విరమణకు
అంతరార్థం ఒకటే
గూడుకట్టిన దుర్మదం.

సంయుక్త సంప్రదింపులలో
వాళ్ళకి నమ్మకం లేదు!
గెలుస్తున్నవాడి మాటే చెల్లాలన్న
రాజనీతి తప్ప!

సంప్రదించక చేసిన యుద్ధ విరమణ
మళ్ళీ అలాగే భగ్నం కాదని
విశ్వాసం ఏమిటి?

ఓ చైనాసురుడా!
మా గడ్డనుంచి తొలగి పో.
చేసింది దురాక్రమణ అని ఒప్పుకో.
స్వాతంత్ర్యమంటే దుస్తంత్రం కాదని తెలుసుకో.

స్వాతంత్ర్య దేశానికి
దురాక్రమణ సమాధిని
కట్టే ప్రయత్నం మానుకో.
ఎవరికోసమో త్రవ్విన గోతిలో
చివరికి నీవే పడిపోగలవు!

ప్రపంచ చరిత్రలో
నీ జాతి ముఖానికి
ద్రోహం, కుహాకం రంగరించి
మసిగా పూసుకోకు.

మానవత్వం నిన్ను హెచ్చరిస్తోంది
బుద్ధి కలిగి మసలుకో.

అకారణంగా చివ్వకు
కాలుదువ్వినవాడు
అణగారక మానడని
హిట్లరు, ముస్సోలినీలవలె
నిరూపిద్దామని పూనుకొంటే

నీవు నమ్మిన సిద్ధాంతాల కట్టెలతో
నీకు నీవే చితి రగుల్చుకోవాలిసొస్తుంది.

విలువల కిరణాలతో వెలిగే
మానవత్వపు సూర్యుణ్ణి-
కబళించే ప్రయత్నంలో
నిన్ను నీవే బుగ్గి చేసుకోకు.
నీ కొంపకు నీవే అగ్గి ముట్టించుకోకు.

నీ రాజీ ప్రయత్నాలు
మా హృదయాల్లో రాజుకొన్న
మంటలపై గుగ్గిలం చల్లినట్లు.
నీ నక్క జిత్తులకు మళ్ళీమళ్ళీ
మోసపోతామని భావించకు.

భవిష్యత్తులో నీ పాపం పండే
రోజొకటి వస్తుంది.
ధరిత్రిలో నిజం జయిస్తుంది.
మానవత్వం నిలుస్తుంది.



## విశ్వనాథ శర్మ, తెలకపల్లి

### ప్ర బో ధ ము

"నలువదియాఱుకోట్ల వదనమ్ముల, అన్నియె గుండెకాయలన్
గలిగియు నిద్రలేచె, నిది-కాలభుజంగము, నాకివేయు వి
వ్వాలముగ చీనిచీమలను- హైందవజాతి, యదంత నొక్కఁడై
నిలిచెను, తాళఁగాఁ గలుగునే యెవఁడైనను శేషు ముందటన్?"

హైందవజాతి నా నాదిశేషుండు, చై
  నీయులన్ మ్రింగంగా నిద్రలేచె,
ఈ కాలసర్ప మదింత కాలముదాఁక
  నిద్రపోయెను- మేల్కనియెను నేఁడు
నిదురించు కుండలినీశక్తి నెవఁడైన
  మరణించె ననుకొన్న మరణమొందు
లేపాక్షి బసవయ్య లేచె, గర్జించెను
  నరసింహమై జాతి-, నరుఁడు రేఁగె

కాటిఱేఁడును రేఁగెను ఖాట్లు మనుచు
గుండు కొక్కటి కొక్కలై గుండె లెల్ల
పేలుఁగాక హిమాలయాల్ పేలుఁగాక
ఓడిపోలేము బ్రదుకులు మాడుగాక.

సర్వనాశనమై నేల చౌడుపోని
ఓడిపోఁజాల మోటమి నొప్పుకోము
ఓడి, బ్రదుకము బ్రదికియు నోడిపోము
పొలిని దాటించువానిని పొలియఁ జేసి
బలుల నిత్తుము పొలిమేర వానిఁ బట్టి.

మీసము లేల మీ కటుల మీసకు లేవె
వృథా భరింపఁగా ?
మీస మఁటన్న - రోస, మది మీరు
తొలంగక హిందులార ! చై
నా సరిజోదుతో పెనఁగి నల్లను
ద్రావుఁడు నల్లమందు వా
రే సరి మీకు ? చూపుఁడు
విశృంఖల వీరవిహార సారముల్ !



## శ్రీ వీరరాజు, సున్నం

దురాక్రమణ

మంచి తృణీకరించి, యభిమానము ద్రుంచి,
యకార్యమంచు దా
నెంచక, పంచశీల గణియింపగ,
స్నేహితులంచు నెంచ కొ
క్కించుక, భారతీయుల జయింపగ
"చౌ-ఎను-లై సిపాయులన్
బంచెను వంచకుండని ప్రపంచజనుల్
నిరసించి తిట్టగన్.

జవహరులాలు శాశ్వత్‌కీర్తి దిశదిశల్
వ్యాప్తిజెందుట సహింపని కతాన,
ఆశించునటు లాసియా ఖండమున దన
'కమ్యూనిజము' పెంపుగనని కతన,
భారతదేశ సంపదలు దినదినాభి
వృద్ధినొందుట కోర్వలేని కతన,
భారతీయులు పాడిపంటలతో సుఖి
యించుట గని మచ్చరించు కతన

కనులలో నిప్పులను పోసికొని హటాత్తు
గా "చ-ఎను-లయి" ధర్మమార్గమును దప్పి
మిత్రరాజ్యంబుపై దండయాత్ర జరిపె;
నితనికంటె గృతఘ్ను డెందేని కలడె ?

న్యాయము దప్పి తా దొలి దు
    రాక్రమణ మ్మొనరించి "ఇండియా
యే" యొనరించెనంచు వచి
    యించి ప్రపంచము విశ్వసింప గా
జేయ నభూత కల్పనల
    జేసి "చ-ఎన్-లయి" చాటుచుండినన్,
మాయురె! వాని మాటలను
    నమ్మెడువారలు లేరు ధారుణి..

ఆయన సత్యదూరు డగు
    నంచు గ్రహించిన రీతిగా "చ-ఎన్-
లై" యను పేరు పెట్టినటు
    లన్ గనుపట్టెడు, "లై"యటన్న "నాం
గ్లేయము"లో నబద్ధమగు;
    నిక్కువ మాతని పల్కులందు నౌ
రా! యణుమాత్రమైన నిజ
    మన్నది యున్నదె మచ్చుకేనియున్!

"చీనీభారత భాయి, భాయి యనుచున్ జెర్మిన్ ప్రదర్శించుచున్
చైనా పెద్దలు రాజ్య విస్తరణ కాంక్షన్ మారణాస్త్రాలతో
సేనల్ పంపిరి "ఇండియా"ను తొలి జేజిక్కించుకొం డంచు, నా
పై నాశించిన ఆసియాను కబళింపన్ వచ్చునం చెంచుచున్.

పోరున గెల్చి, యాంగ్ల ప్రభు
వున్ దొలగించి, స్వరాజ్యలక్ష్మి జే
కూరగ జేసి మన్ననల
గొన్న పరాక్రమశాలురైన తత్
భారత వీరసైనికుల
పౌరుష మప్పుడె విస్మరించినా
రౌర ! పెకింగు పెద్దలు మ
దాంధులు, జ్ఞానవిదూరు లౌటచే.

ఆటంబాంబులు మాకు నున్నవని బా
హాటమ్ముగా, మాటికిన్
జా లెన్ ధాటిగ "చ-ఎన్-లయి" భయా
నన్ భారతీయుల్ మరే
యాటంకంబును లేక లొంగెదరటం
చాసించి; యవ్వానికిన్
యాటంబాంబులె యున్న నీశ్వర స
హాయం బేది నిర్జింపగన్.

అనుచితరీతి శత్రువు దురాక్రమణం బొనరించినంతనే
కని వినినంత నైక్యమును గాంచిన భారతజాతి భక్తితో
ధన కనకాదు లంపెను ప్రధానికి తత్క్షణ మాతృదేశ ర
క్షణకు బ్రవాహరీతిగ జగజ్జను లచ్చెరువొంది మెచ్చగన్.

అనుపమ దేశభక్తి గల
యంగన లెందరొ మాతృదేశ ర
క్షణ నిధికై యయాచితము
గా దమ స్వర్ణ విభూషలన్ సమ
ర్పణమును సల్పి, యుద్ధమున
భారత వీరులతో స్వరాజ్య ర
క్షణ మొనరింప గంకణము
కట్టిరి వైరులు తల్లడిల్లగన్.

శాంతి కాంక్షించి మిత్రరాజ్యములు న్యాయ
సమ్మతమ్మగు కొన్ని సూచనలు చేసి,
యిరువురును సఖ్యపడుడని హిత మొనర్ప,
ద్రోహబుద్ధిని నవి చైన త్రోసివైచె.

న్యాయము దప్పి సంగర మొ
నర్చుట నాశనహేతువంచు, గాం
గేయ, జనార్దనాది మహా
నీయులు చెప్పిన లెక్కసేయ కే
మాయెనొ కౌరవేశు! డటు
లయ్యెడు" "చౌ-ఎను-ల"య్యు కూడ చై
నీయులతో, జయం బొదవు
నిక్కము భారతజాతికే తుదిన్.

—o—

## శ్రీ వెంకటరత్నం, అంబటిపూడి

ఉత్తిష్ఠ

చర చర ధావ ధావ
భారత యువవీర చర
అరివీర భయంకర చర
త్వరయా చర చరచరచర
చర చర ధావ ధావ
హిమ శీత ధరాధర తల
సమరాంగణ కేళీ పర
రమణీయ పరాక్రమ చణ
చర చర ధావ ధావ
చీనాసుర హృదయ గుహా
రుధిరాసవ పాన మత్త
మస్తిష్కో-భవసి ధ్రువమ్
చర చర ధావ ధావ
భారత జనయిత్రీ సుఖ
భాగ్య లోభ దుష్టాసుర
మారణ దీక్షాపరాయణ
చర చర ధావ ధావ
వ్యష్టి సమష్టి స్వరూప
విశ్వ భారతైక్యరూప
తిష్ఠోత్తిష్ఠ పరంతప
చర చర ధావ ధావ.

## శ్రీ వెంకటరత్నం, కౌనకళ్ల

### "నిను తరిమి కొడతా"

చివరి నెత్తురు బొట్టు
చిందిపోయేదాక,
నిను తరిమికొడతా;
నీ ఆట కడతా.

నా మేడ, నా వాడ,
నా యిల్లు, నా పల్లె
పగులిచ్చిపోయినా,
పాడుపడిపోయినా — చివరి॥

నా దొడ్డి, నా తోట,
నా దొడ్డ మాగాణి
మోడులై పోయినా,
బీడుగా మారినా — చివరి॥

నా శక్తి, నా యుక్తి,
నా సర్వ సంపత్తి
నష్టమైపోయినా
నాశమైపోయినా — చివరి॥

వెన్నుపోటున నన్ను
కన్నుగప్పిన నిన్ను
మన్ను దినిపించకే
మనుగ డేదీ నాకు? — చివరి॥



## శ్రీ వెంకట వరదాచార్యులు, T. N. C.

భారతా!

జననికి జ్యేష్ఠ పుత్రుడగు
        జవ్వారు యోధుడు శాంతశీలుడై
వినుడని చెప్పుచున్న, నవివేక
        గుణంబున గాలు ద్రవ్వు దు
ర్జనుల సహింతువో! తగిన
        శక్తిని వెన్కకు నెట్ట జూతువో!
కను మతి దీర్ఘదర్శివయి
        కాలగతిన్ దలయెత్తి భారతా!

కనకనలాడు చిచ్చువలెఁ
        గాలము వచ్చి హఠాత్తుగా బడెన్
దనువున జీవముల్ గలుగుదాక
        సహించి త్యజించి నిల్చుటో
ఘనమగు కీర్తిఁ బోదుడిచి
        శత్రుని బట్టినచేత మ్రొక్కుటో
మన యెదకాని నిల్చె; తగు
        మార్గము జూడగదయ్య భారతా!

దండిగ సైన్యముల్ పెనిచి,
        దక్షిణ గోగ్రహణమ్ము సేయగా
నుండిరి వైరు లుగ్రముగ-
        నుత్తర గోగ్రహణమ్ము సేయగా

దుండగులై మహోగ్రిముగ
దూకిరి చైనులు హద్దుమీఱి, భీ
ముండు, కిరీటిపై నిలిచి
పూర్వుల ఖ్యాతిని నిల్పు భారతా!

కోరగరాని కోరికల గోరుచు
నిద్దరు రెండు దిక్కులన్
బోరొనరింప సేనలను వ్యూహము
దీర్చుట దేటి చూడవా ?
కూరుకుచుంటివా ? కుడిచి
కూరుచు నుండుట వీరధర్మమా ?
భారము నీదిరా ! భరత పౌర !
కుమార ! బిరాన లేవరా !

పిడుగయి రామ బాణములు
భీముని భీషణ ముష్టిఘాతమై
మృడుని త్రినేత్రమై కదిసి
మృత్యువు శత్రుల మ్రింగుదాక, నీ
మెడమను ద్రిప్పకోయి ! మితి
మీఱిన నున్నది ధర్మరక్ష, నీ
యుడుమల కెందు ముందు
జనియించని కీర్తిపథంబు భారతా !

హృదయము లేని జాతులకు
        హృత్కుఠిశంబయి నిల్చి వెల్గరా!
చెదరని బుద్ధినీది, స్థిరచిత్తుడ
        వీవు, జగాన దేనికిన్
బెదరని గుండె నీది, తనువే
        మదినెంచని జాతి నీది, నీ
కెదురయి యెవ్వడోపు
        జగదేక బలాఢ్య గుణాఢ్య భారతా!

చూపగదయ్యా నీ తెగువ,
        చూపరు లెల్లరు చోద్యమందగా
నీ పగ దాయ గుండియలు
        నీఱయి పొఱగ శౌర్య ధైర్యముల్
చూపిన తీరు మెచ్చి కవి
        లోకము నింపుగ పద్య గద్యముల్
నీపయి వ్రాసియ, వైరితతి
        నిందల పాలయిపోవ భారతా!

పగిలి యుసుళ్ళ పుట్టవలె
        బర్వతపంక్తుల దాటి భూమిపై
దిగి చెలరేగి మత్తులయి
        తిందుము మిమ్మని వచ్చినా రదే!

పగతురు, నిద్ర మేల్కొని
 శుభమ్మని యూదర శంఖరాజమున్
దిగుదురు కొండ కావలను
 దియ్యని మాటల బోరు, భారతా !

చీమల బారులట్లు మన సీమల
 గాలిడె, చైన సైన్యముల్
పాములు చేర బుట్టల
 నపారముగా నిక బెట్టు నిప్పుడే
చీమల బారులన్ దుడిచి
 చిందర వందర చేసి వైవగా
స్తోమత గూర్పరా ! మిగుల
 శూరత జూపర వీరభారతా !

ఆశను జంపలేవ, మన
 హక్కుల జిక్కుల దీర్ప బూనవా,
దేశము నీది కాద ? పర
 దేశజు లేలగ గంట జూతువా,
దేశము దేశ నాయకులు
 దిగ్భ్రమ జెందుట గాంచి యోర్తువా,
దేశము శాంతి గూర్పగను
 దీక్ష వహించర వీరభారతా !



శ్రీ వెంకటాచార్యా, కె.

## గుండెపై కుంపటి

కపటబుద్ధితో చైనాయె ఖడ్గమెత్తె.
భటులు రాలిరి భరతాంబ పాదములను,
క్షుభిత హృదయమ్ము ఘోషిల్లె శోకవితతి,
నిలిచె కుంపటి గుండెపై, నీతిధనుడ !—

ఘోరము ఘోరమో సఖుడ !
కుత్సితమిత్రుడు చైనవాడు, సం
భారము గూర్చి, సీమ విధి
భంగమొనర్చె, కవోష్ణ రక్తమే
పారెను హైమభూధరము
పై నగరాజు, కదల్చె నశ్రువుల్
ధీరత వేగ రమ్ము, బల
తీవ్రతజూపి మరల్చు శత్రువున్॥

చక్కని భూమి కొంత ఘన
శత్రు సమూహ్యృతమాయెనె ? వేదనం
జిక్కుట, భావ్యమాయెనె ? రిపు
సేనల దున్మి మధింప లెమ్మురా !
టక్కరి జిత్తులన్ని, కప
టమ్మె, రణమ్మున లొంగరాదు, ము
న్నెక్కడలేని దుర్విధి ని
కెట్టుల శౌర్యధరిత్రి సైచురా ?॥

విరివిగ మారణాస్త్రముల
　　పెంచి, సమస్త జగంపు నేస్తమే,
బిరబిర గూర్చి, చైన యను
　　భీకర రాక్షసమూర్తి గూల్ప, దు
ర్భర రణహింస దేల్ప, నవ
　　భారత రక్షక ! సైన్యశక్తి, సం
గరమున జూపి, రక్షకయి
　　కాల్చుము వైరి బలాఢ్య యోధులన్॥

నిదుర, విహారబుద్ధి, పర
　　నింద, దురాశ, నిగూఢ వంచనల్
వదలవలెన్, ప్రచండయుగ
　　భంగిమ కన్పడ నైక్యయుక్తి సం
పద నిగుడించి, మించి, రణ
　　భైరవి గెల్వగ, జైత్రలక్ష్మి కి-
వధిపతి వౌదు, సద్భటుడ
　　వై ప్రబలోద్ధృత, రుద్రమూర్తివై॥



శ్రీ వెంకటేశ్వరరావు, నార్ల

## నవశకం

చీకటి తెర తొలగునులే- ఇక నీ
వాకిట సిరి వెలుగునులే.... చీకటి....

రేపన్నది వచ్చునులే-ఆపన్నుల మెచ్చునులే
కన్నుల తడి నొత్తునులే-చిన్నగ వొడికెత్తునులే
ఇక నీ వాకిట సిరి వెలుగునులే.... చీకటి....

చిత్తము చిగురొత్తునులే-ఎత్తుగ ధ్వజమెత్తునులే
సత్యము పురి విప్పునులే-నృత్యము ధర నొప్పునులే ఇకనీ॥

నవశకమే విరియునులే-నవ్యాభ్రము కురియునులే
న్యాయం బిల నిలుచునులే-నవజీవం పిలుచునులే ఇకనీ॥



## శ్రీ వెంకటేశ్వరులు, విశ్వనాథ

### చీనా దురంతము

చెంగిజ్ ఖానుని శిష్యుడు
దొంగముఠా గురువు దారిదోపిడి కాడున్
అంగిట విసమును మాటల
పొంగెడు తేనియలు చిందు బూచి దొరయునున్.

చౌయన్లై భారత దే
శాయతి కన్నెఱ్ఱగాఁగ నగజాపతికిన్
ప్రియంబగు కొండల న
న్యాయముగా నాక్రమించి యదరిపడియెడున్.

ఎఱుగడు భారతి సత్తను
నెఱిగి యెఱింగియును దూకి యీడ్గెలబడెడున్
కఱకులు భారతి కత్తులు
తుఱుమును వెంకాయఁబెట్టి తుఱుమినయట్టుల్.

తరముల పొలిమేరలలో
సరిసరి పూర్వపు తరాల సందులు గొందుల్
మఱిగి మఱిగి తనవనుచున్
గిరికీలను గొట్టు పొగరు క్రేశ్వారంగన్.

కార్మిక సమతా సిద్ధాం
తోర్ములలో నన్యరాజ్య యోగము కనుచున్
దుర్మతి భూతలమెల్లను
దోర్మూలగతంబు సేయ దుందుడుకు పడున్.

హిట్లరు ముసోలినులు లే
గట్లంబడి పోయినారో కనలే కెన్నో
పాట్లు పడు వీని కాలము
చిల్లెన్ నేటికి వినాశ సిద్ధింగనుతన్.

భరత త్రివర్ణ కేతన
గురుతర వహ్నికలఁ గాలి కుమిలెడు నాడేన్
బిరుసు చెడి భరతవీరుల
గరిష్ఠతయు దెలియవచ్చు గాదే తనకున్.

కాషాయంబుల బుద్ధుని
వేషమునన్ విషపుకీట వికృతిం బూనున్
రోషమయ తరువు వీనిన్
భేషజముగఁ గాల్చుకున్న బృథ్వి మిగులునే?

దండము దశగుణ మగునన్
చండవచన శక్తి దుష్టసత్త్వము వీనిన్
గండడచి తోలకున్నన్
దండియె భారతపతాక ధారుణి నున్నే?

స్వస్తియగు భరతమాతకు
స్వస్తియగుత మంచుగొండ సరదారులకున్
ధ్వస్తంబై చైనాయు న
పాస్తం బగుగాత భరతు లాహవధాటిన్.

—(o)—

## శ్రీ వేంకట రామకోటిశాస్త్రి కె.

పంచానన ప్రస్తుతి

ఘోరము ఘోర ఘోరతర
ఘోషణ భీషణమై అధర్మ సం
హార సముత్సుకత్వమున
యందు విజృంభణమున్ బొనర్చు గం
భీరుని దక్షిణ ప్రథిత
భీకరవక్త్రము మాదుశత్రు సం
హార నిమిత్త మీ సమయ
మందున జాగరితాత్మ మయ్యెడున్.

ఏకముఖమ్ముగా నిలిచి
ఏచెడు రాక్షస శక్తినెల్ల తా
వైకృతముం బొనర్చి బల
భద్రము సల్పెడు నట్టి ఆత్మలిం
గాకృతి కాంరుద్రభయ
దాద్భుత ఫూత్కృతియొంచు వామదే
వాకృతి వొల్చు ఉత్తరము
వక్త్రము మాకరి నాశకమ్మగున్.

తానయివచ్చి బాంధవము
ధర్మము పెంచుకనిచ్చి పుచ్చుకో
పూనికచేసి విశ్వజగ
ముం గనగా కృతకార్యుడై తుదిన్

హీనపు బుద్ధిజేసి కల
హించిన దఘుని పీచ మార్పగా
నైనది పీరభద్రిము మ
హా స్వరిసూదన మౌత మాకిటన్.

క్రూరమృగాత్మతన్ వెడగు
గొన్న మనుష్య పరాక్రిమమ్ము క్రో
ధారభటిన్ ప్రిపంచకము
నామెతగా గొనగోరి సాగి సం
చార మొనర్పుచో జగము
శాంతికినై ఎదురొడ్డి పోరి సం
హార మొనర్చినట్టి శర
భాకృతి మాకరిభీతి డుల్పుతన్.

ఈసిడి మానదండమని
యెవ్వరు చెప్పిరి దీని, దీనితో
వీసములేదు మాకుపని
పీడునకా గిరిగీత లంచునున్
త్రోసుక దేవతాత్మపయి
దొమ్మియొనర్చి పురోగమించు చై
నాసుర కైతవమ్ము నణ
గార్చుత శాంభవ వీరమియ్యెడన్.

---

## చైనా దురాక్రమణము :

బహువిధ త్యాగ ఫలముగా ప్రాప్తమైన
దేశము స్వతంత్రతకు పెద్ద దెబ్బ తీయ
దాపురించెను చైనీయ దండయాత్ర
మొగిలు లేకుండ పడు పిట్టపిడుగువోలె.

ఎన్నో కష్టములన్ భరించి జనయి
త్రీ దాస్యబంధమ్ములన్
ఛిన్నంబుల్ పొనరించి భారతజనా
నీకంబు స్వాతంత్ర్య సం
పన్నంబై క్రమరీతి నభ్యుదయ శో
భం బొందుటం గన్గొనన్
గన్నుల్ కుట్టిన వక్కటా ? కుటిల చై
నా నాయక శ్రేణికిన్

ప్రాణంబుల్ వెలపెట్టి కొన్న విలస
త్స్వాతంత్ర్య భండార మీ
చైనా సైన్య భుజావ లేప దహన
జ్వాలేంధన ప్రాయమై
పోనుండంగ నిం కేల నశ్వర ధనం
బుల్ భర్మముల్ ప్రాణముల్
పూనుం డాహవ దీక్ష శత్రు నివహం
బుం జీల్చి చెండాడంగన్

సత్య మహింస యన్ ప్రథిత
సత్త్వ గుణంబులు నిక్క మార్య సం
స్తుత్యము లౌను కాని గుణ
శూన్య లెడాటమునన్ ఫలింప వౌ
చిత్యము వీడి ద్రోహ మతి
చెట్ట దలంచెడి ధూర్త పాళి యౌ
ద్ధత్యము సాహసంబున హ
తం బొనరించుట నీతి యయ్యెడున్

క్రూర విధుంతుద గ్రసన
కుంఠిత మౌ విధుబింబ మట్లు దృ
ప్తారుల బారి కగ్గమయి
హావళి చెందెడి దేశమంతయున్
భూరి భుజా పరాక్రమ స
ముద్ధతిఁ జూపినఁ గాని నిల్పుకో
నేరము దీర్ఘ కాల మహా
నీయ తపఃఫల మౌ స్వరాజ్యమున్

ఇది మన జాతికంతకు ప
రీక్ష యగుం బరిపంథి వాహినీ
మద మడఁగించి వైజయ ర
మా శుభ సంగతి పెంపు గాంచుటో

పొదిగొను దుర్యశః పటల
    మున్ ధరియింపక మున్న ప్రాణముల్
కదనమునందు వీడి దివి
    గాంచుటో యొక్కటి తేలిపోవలెన్

కలయం బాఱుచునుండె శీతగిరి గం
    గా బ్రహ్మపుత్రానదీ
సలిలోర్మి ప్రచయంబుతోడ జననీ
    స్వాతంత్ర్య సంరక్షణో
జ్జ్వల దీక్షా ప్రచల త్సహోదర కవో
    ష్ణ స్ఫార రక్తాపగల్
ప్రళయం బింతకు మించి కల్గునె? రణ
    ప్రారంభులై లెండికన్

కులభేదంబులు వర్ణభేదములు దు
    ష్కోపంబులున్ నాశకృత్
స్థలభేదంబులు పక్ష భేదములు సం
    త్యక్తంబులం జేయుచున్
బలగర్వోద్ధత వైరి వర్గముల మా
    పంగూడి యేకమ్ముగా
వెలుఁగింపుండు సమైక్య భారత లస
    ద్వీరస్ఫురద్దీపమున్

ఆగినట్లై యుండి యదరి పై కొన వత్తు
రాగకున్న నింద లాడుచుందు
రరులనెప్డు హృదయమార నమ్మటు కూడ
దుఃక మోసపుచ్చుచుంద్రి కాన.

పడమటి దేశముల్ మనకు
బాసట లై నిలిచెన్, స్వధర్మ ని
ష్ఠుఁడు జవహార్ ప్రధాని యరి
సూదన మార్గ గవేషణంబునం
గడు నిపుణుండు, ధర్మమె స
కం బెసఁగున్ మన పక్ష మంద, చే
పడు భరతోర్వికే జయ శు
భం బనుమానము పొంద నేటికిన్.



శ్రీ శశాంక, వి.

## దండోరా!

రండోయి రండోయి దండోర మ్రోగేను
రండి చేరండోయి రణభూమిలోను
పెరవాడు పగబూని పైన బడుతుంటేను
పందలై తలయొగ్గి బ్రతుకు లీడ్వగలేము
మన తల్లి బ్రతుకిటుల మలిన మౌతుంటేను
నెత్తు రురకలువేయ నిలుపోపగా లేము!

జాతిపిత గాంధీజి చేతికిచ్చిన స్వేచ్ఛ
చేతులారగ జారవిడిచి మనగాలేము
దేశ స్వాతంత్ర్యమ్ము బుగ్గిపా లౌతుంటె
దిక్కుమాలిన యటుల బిక్క వోవగలేము
శతృవుల నిర్జింప సైనికులవలె కదలి
చావొ బ్రతుకో నేడు తేల్చుకోవలె రండు!

మన శాంతిమయ పథము సైనిక శ్రేణిగా
నిర్మాణ యత్నమే సమర సంరంభముగ
మార్చ్చె చైనీయ రాక్షస దురాక్రమణమ్ము
మారవలె వీరులుగ కవులు గాయకులెల్ల
పలుకులే బళ్ళెములు పాటలే బాణాలు
రండి పగతుర గుండె చీల్చి చెండాడండి!

పర్జన్య గర్జనలు గాయకుల కంఠాలు
ప్రళయతాండవ మొకటి నాట్య విన్యాసమ్ము
రణకౌశలమె కళా కౌశలము మనకిపుడు
సమర సన్నాహమే నిజ రసాస్వాదనము
    ప్రాణాల నొడ్డి పోరాడుటే ప్రతిభగా
    పాడండి, ఆడండి ప్రళయ రుద్రులవోలె !

శాంతిజీవిక నిషాదుల పాలబడి చెడగ
శాపాల నురలించి రాకాసులను దునుమ
వాల్మీకిముని వంశ గౌరవము నిలుపంగ
పాడాలి నవ్య సంగ్రామాయణ మ్మిపుడు
    శోకమును శ్లోకముగ మార్చి పఠియించండి
    లోకమున సుఖ శాంతులను నిలుపగా రండి !

ఎగు భుజమ్ముల హిమాలయ మియ్యదే లేచి
ఇక్ష్వాకు కులతిలకు భీకరాకృతి దాల్చి
శత్రువుల నిశ్శేష మొనరింప సమకట్టి
రామబాణము బట్టె; తిరుగు లేదిక మనకు
    జయము జయమని పూలవాన కురిసేను
    శాంతి జగతినికోరి వచ్చి వలచేను.



## శ్రీ శామ్యూయెల్, జి. జె.

### చైనా దురాక్రమణ

గుటకాయ స్వాహా యన
తటస్థ రాజ్యంబుపైన దండెత్తు మిమున్
నిటలాక్షుం డుగ్రుండై
కుటిలపు తంత్రములనెల్ల గూలుచుగాతన్.

కైలాస మునికిగా గల
ఫాలాక్షునికైన సుంత-భయపడకుండన్
ఆలమునకు సిద్ధపడిన
బాలీశుల పీచమణచ-బాధ్యత మనదే.

చైనాను బిలువకుండుట
నానాజాతుల సమితికి-నగుబాటంచున్
మానక వాదించిన, యభి
మానంబును సొంతముగను-మంట గలిపిరే?

మా దేశపు సిద్ధార్థుని
నాదర్శముగగొని వాని-యాజ్ఞలపట్లన్
నూదిమొన యంతయైనను
నాదరణను జూపకుండు టతి దారుణమౌ.

కైకొనియు, పంచశీలము
లేకముగా విస్మరించి-యిచ్చకపు నుడుల్
వాకొని యిప్పట్లను, మర
మేకై కూర్చుండినారు-మ్లేచ్ఛులరీతిన్.

సహనము మా నైజమయిన
అహింస బాల్యంబునుండి-యల వాకైనన్
అహరహము బోరి మీతో
తుహినాద్రినె పడయగలము తుది విజయంబున్.

ఇరువేల యేండ్లనుండియు
సరాసరిగ సాగుచున్న-సభ్యత తృటిలో
పరిమార్చిన మిము, దురమున
పరాజితుల జేయకుండ-పట్టు విడుతుమా!

సనయెట్ సేను-చరిత్రను
తెనుగున ప్రచురించునట్టి-దేశస్థుల పై
అని చాటించిన చైనా
జనాంగమును మెచ్చలేరు-సజ్జను లెవరున్.

రవులుకొనిన యుద్ధమునకు
సవిస్తరముగ సమకూర్చి-సకలాయుధముల్
పవరములో మన పగతుర
సవాలు నెదురుకొనదగిన-సమయం బిదియే.

పంచశీలంబుల ననుసరించ నెంచి
పంచశిల లాక్రమించిన-వంచకులుగ
సిద్ధమైనారు బౌద్ధులు-యుద్ధమునకు
సత్యశౌచాళి గాలికి జారవిడచి.

—(o)—

## శ్రీ శివరామారావు, వింజమూరి

### యుద్ధ గీతి

ఈ దేశము భారతమ్మొ
నీదే సుమ వీరుడా!
స్వాతంత్ర్యము సాధించిన
ఖ్యాతి నీది ధీరుడా!!

పంటకు నే లోటులేదు
పాడి కేది సాటిరాదు
బంగరు మాగాణి నీది
పొంగి పాట పాడవోయ్!!

ఎవ్వరినీ ద్వేషించక
ఎవ్వరిపై రోషించక
సాగుచున్న మనపై నే
మూగె నేడు కారుమబ్బు!

పౌరాణిక యుగమునుంచి
చారిత్రిక కాలమందు
నేటిదాక పౌరుషాన
మేటిబంటులము మనం!

మేటి కర్మవీరుల కాయశూరులం
ధర్మమార్గ చారులం
జాత్రిము చూపిస్తాం
శత్రుకోటి జయిస్తాం.

## చీ నా క థ

చిన్నతనములో చీనా నామము
చెవి బడినంతనే చీనాంబరములు
కౌశేయంబులు జ్ఞప్తికి వచ్చును
ఊటలూరగా నోటను పిమ్మట
మెత్తని చక్కెర స్మృతిలో మెలగును
కౌమారంబున 'కంగ్' 'ఫంగ్' 'చంగ్'
సూక్తి పఠనమున బొక్కెడివారము
మింగు నాయధర మేదినీశ్వరుల
రంగుల మేలిమి పింగాణీలకు
ముగ్ధ మనస్సుల మురసిపోయితిమి
పటచిత్రంబుల, పంచలోహంబుల
బహువిగ్రహముల పచ్చల సొబగులు
పరికించితిమి.
నల్లమందు తిను నరులని ఎంతో
జాలి చెందితిమి.
శతృదేశములు చీనా భూమిని
చీల్చుచున్నపుడు
ఆక్రోశించిరి యన్యాయం బని,
ఎట్టెట్టులో తెప్పిరిల్లి కుదుటం బడ్డు
చల్లచల్లగా శక్తి సామర్థ్యముల్ పొంది

కాంచీ 'రూసీ' అండ క్రమముగా వర్ధిల్లి
మరచిపోయిరి వెనుకమాట చీనావారు
బలవిహీనుడు సురా
        పానంబు చేయుచో
తక్షణంబే కైపు తలకెక్కేడి విధాన
అభినవోత్సాహాన ఆవేశవశులైరి,
చీని చీనాంబరమ్ము లవి యెల్లను
తేళ్ళునై జెర్రులై దుష్టసర్పమ్ములై
చీనా చక్కర అంతయు చేదై విషమై పోయెను.
మనసే విషమైపోయెను మరి కాని
        దికే ముండును ?
చూచి చూచి చతురమ్ముగ
        చుట్టుపక్క ప్రదేశములో
కబళింపన్ జొచ్చినారు
        కప్పవోలె మెలమెల్లన
'తిబ్బతి' దేశంబన్నను
        దేవభూమి వంటి దండ్రి
అమాయకులు జనులు; దాని
        నాక్రమించి వేసినారు
మంచి మంచి మాటలతో
        మనసుగూడ మోసగించి

'లడహో'దిశ మైన హిమా
లయము ఆక్రమించినారు,
'అసమ' దేశ భాగము పై
నాక్రమణము చేసినారు,
భారత భాగములు కొన్ని
పట్టుకొనం దలచినారు
లోకమంత వారికి వ్యతి
రేకంబగు కారణమున
కుటిలనీతి పూర్వకముగ
కొంత వెనుక కరిగినారు
శీఘ్రముగా చైనీయులు
చేరవలయు యథాస్థితికి
వ్యవహరించు చుండవలయు
న్యాయ బుద్ధితోడ నింక,



# శ్రీ శ్రీరామమూర్తి చిమ్మపూడి

హెచ్చరిక ! ! !

కన్నుల ప్రేమ జూపితివి, కత్తికి తేనెలు బూసి, పైన, మా
యన్నల మీరెయం చెద తలంచిన ద్రోహపుబుద్ధి యిట్టులన్
అన్నిట హద్దుమీరె, సరిహద్దుల దాటిన నేస్తగాడ, ముం
దున్నవి చైనియాసుర ! సముద్ధతి నొచ్చు ముసళ్ళపండుగల్ !

తియ్యని తేనియల్ చిలుకు దీటగు నల్బదికోట్ల గుండియల్
కయ్యము గుర్తెరింగినవి, కావరమెక్కిన కద్పుమంటతో
వియ్యపుమాటల న్బలుకు వెన్నుల పోటుల ద్రోహి ! నీకు మా
నెయ్యము చేదుయయ్యె, సరె ! నీగ్గెడు నీ బ్రతుకింక బుగ్గియా !

రక్తపుకూటి యాసతొ కరాలను సాచిన రాజ్యకాంక్ష, నీ
శక్తుల చేదుకొన్నది విసమ్ముల గ్రక్కెడు పాము బుద్ధి, నీ
యుక్తులు మండ-చైనియ!పయోముఖపున్విషకుంభమా!త్వదా
సక్తి పిశాచతత్వము విషాద నిషూదనమే, నిశాచరా !

సరదా యం చరుదెంచి, యింట తిని వాసాలన్ని లెక్కింతె, మా
సరదార్లద్దియ చూచినారు, తమ మీసమ్ముల్ దగన్ దువ్వి, భీ
కర తేజోమయమూర్తు లింక మిము ముక్కల్ముక్కలున్ జేయ, మా
కరవాలంబుల ఘాటి జూచెదవులే, కర్కోటకా ! చైనియా !

—o—

## శ్రీ శ్రీరామారావు, శంకర

### ఒకరి సమస్య కాదిది

అవిగో! యుద్ధపు కాలమేఘముల సంఖ్యామ్ముగా క్రమ్ము కొన్నవి; చైనీయులు దారుణారుణవిధాన ప్రక్రియన్ విశ్వ విప్లవ దావాగ్నుల భారతావని హరింపన్ జూచుచున్నారు శాత్రవజీమూతము రూపుమాపి మన స్వాతంత్ర్యమ్ము రక్షింపుడీ!

ఎన్నో కష్టపరంపరల్ గడచి, యెన్నెన్నో మహాత్యాగపుం దెన్నుల్ దాటి గడించుకొంటిమి స్వశక్తిన్ నేటిస్వాతంత్ర్యమున్ ఛిన్నాభిన్న మొనర్పజూచెదు నిదే చీనామహాభూత మన్ననాన్న దౌష్ట్యము రూపుదాల్చినవిధానన్: దీని జెండాడుడీ!

పశువో? మానవుడో? ప్రపంచమున సర్వశ్రేష్ఠుడెవ్వాడొ? ఈ దృశమౌ రాక్షసకృత్యమెవ్విధి ధరిత్రీ సంస్కృతుల్ సైచునో? వశముందప్పిన మానవత్వమిలపై వర్ధిల్లునో? చచ్చునో? యశమో? మృత్యువొ? తేల్చుకోవలయునయ్యా
లోక మిప్పట్టునన్.

ఒకదేశమ్ము ప్రపంచశాంతికొర కుద్యోగించి, తన్మార్గమం దొక భల్లూకముచేత జిక్కుకొని కన్నుల్ మూసెనేనిన్ వికావికలై కూలదె సభ్యతానిలయముర్విన్! సర్వదేశప్రజల్ ప్రకటోత్సాహముపూని మేలుకొనుడీస్వాతంత్ర్యసంరక్షకై.

ఒకరి సమస్య కాదిది మహోన్నత మానవతాసమస్య; నైతిక సమరాంగణంబిది; మదించిన మానవజాతి ఆత్మ హత్యకు విషపాత్రబూనినది; తద్విషమున్ పడద్రోసి మానవాళికి నిజధర్మనిర్వహణలేశము నేర్పుడు సభ్యదేశముల్.

## శ్రీ శ్రీవత్సం

### లేవవోయ్!

లేవవోయ్! లేవవోయ్!
లేచి నడుం కట్టవోయ్!
భారత భూభాగంపై
దురాక్రమణ సాగించే
చైనా నెదిరించవోయ్!
జయపతాక నిలుపవోయ్!

హిమాలయపు చలియల్లో
హిమవంతపు జాడల్లో
సరిహద్దు నతిక్రమించి
సాహసించి పైకి వచ్చి
సింహనాద మొనరించే
భారతీయ వీరులపై
గుండ్లవాన కురిపించీ
నెత్తురు చిందించిందీ; ॥లే॥

సత్యాగ్రహ సమరంలో
సాహసించి యెదురు నిల్చి
ఆంగ్లేయుల గుండెలలో
అదరును కల్గించినావు
నీ ధైర్యం నీ స్థైర్యం
నిశ్చలమై పొంగిపోవ
తుపాకీల కెదురు నిల్చి
విజయం స్థాపించాలి! ॥లే॥

నెహ్రూజీ ఆశయాలు
నిండారిన కోరికలు
నిత్య నూత్న పథకాలు
నైర్మల్య వికాసాలు
నీవే నిలబెట్టాలోయ్ !
నీవే పోషించాలోయ్ !
నీవే రక్షించాలోయ్ !
నీవేనోయ్ ! పౌరుడా !
లేవవోయ్ ! లేవవోయ్ !
లేచి నడుం కట్టవోయ్ !



## ఉత్తర గోగ్రహణము

అదె యాక్రమించినా రు
స్మదు ఉత్తరసీమలన్ సమస్తము గో సం
పద నొక్కటి పరు లా
కదర్యులగు వారి నూరక వదలుటయా !

మన గోసంపదనా హరించిరన నేమౌ నంతతో నాగునా
మన భూసంపద నాహరింపరని సంభావింప వీలున్నదా ?
ఎనయన్ రెండును రెండుగా నగునుగానీ, గోధరిత్రిద్వయిన్
కన భేద మ్మిసుమంత లేదు భరతక్ష్మావాసి కేనాటికిన్.

ఈ దండెత్తినవానికిన్ మనకుగానీ పూర్వ వైరమ్ము లే
నీ దుర్వ్యాపృతులేని వాదనలుగానీ లేనె లేవయ్యె, నే
డేదీ క్రొత్తగ చేయుచుండుటయుగానీ లేదు స్నేహమ్ములో
నే దండెత్తెనటన్న మోసమునకై యింకేమి చెప్పంగనౌ.

వాడా! వాడొక ధార్తరాష్ట్రుడు ధరా వాంఛా విషాక్తుండు, మా
యాడంబాధికు డట్టివాని కొక స్నేహమ్మంచు ధర్మమ్మటం
చేడన్ గల్గును, స్నేహ వాక్యములతో నే నమ్మికంజూపి యా
టాడించున్, మరి మోసమే కొనమొదల్లై గెల్పు రాజూచెడున్

సరి యివ్వియన్ని పోనీ
పరకాంతన్ నిండుసభకు వస్త్రము లూడ్చిం
తురె ! యదియున్ జేసె మహా
ఘ దురంసాపప్రథమ మూర్తిగా, రారాజై

వానిగని పిరికితనమా ?
వానికి భయపడుటయా ? అవార్యుడువాడా ?
వాని యధర్మమే బల
హీనత వానికిని, ధర్మమే మన బలమై.

పోనీ గోవులెకాదె ! ఏనుగులె పోనిమ్మనన్ వచ్చు నీ
వైనన్ భూ ప్రజలెల్ల నీయటుల కారయ్యా ! మరిన్ నీవలెన్
తానీ గోవని యన్నయంత పశుమాత్రమ్మంచు నూహింపరున్,
ప్రాణమ్ముల్ బలె, దేవతల్ బలెనె సంభావింతు రెల్లప్పుడున్

గోవన గోవెకాదు మరి గోవన భూమియు కాంతిరేఖయున్
గోవన స్వర్గమున్ మరియు గోవన వాక్కును, దేవతాళి వా
సావసథమ్ముగాగ భరతావని బుట్టిన యెవ్వడేని చే
తోవధిగా నెరుంగు పరమార్థ మటంచు వినిశ్చయించెదన్

శ్వేతశ్వేత మనోహరాంగ రుచులన్ విస్జిల్లు శృంగమ్ములన్
మాతృత్వానభిభూత వీక్షణములన్ బర్యాప్త వత్సమ్ములన్
స్ఫీతస్వాదుపయః ప్రవాహకములన్ వేరెవ్వరో వచ్చి గో
వ్రాతమ్మున్ హరియింపగా నెటుల నోర్వన్‌వచ్చు వైరాటికా !

నరునకు మువ్వురు తల్లులు
నరయంగా కన్నతల్లి, అవనియు గోవున్
మరి హెచ్చుతగ్గు లేవియు
స్ఫురించ వీముగురియందు పొడమని లోనై.

ఎవడో తల్లిని వచ్చి బంధించు నప్పు
డవమతిం జేయు నప్పుడు నాక్రమించు
నప్పుడును గూడ కన్నుల నప్పగించి
చూచుచుండుటకన్నను నీచమున్నె ?

తరి మాతృత్రాణము దీర్పలేని జనుడెంతన్ గొప్పవాడైన ది
గర్వణాలంకృత కీర్తివల్లరులతో వర్ధిల్లువాడైన, మం
దర ధీరుండును మేరువంత బలియైనన్ గూడ నేమయ్యె, త
న్నర జన్మమ్మును జన్మమా! మరియు పుత్రత్వమ్ము పుత్రత్వమా?

వాడు మనపైకి నిటు వచ్చినాడనంగ
వాని యాశల నూహాల పద్ధతులును
ఎన్ని విధములుగా ప్రసరించునో, అ
దేమొ చెప్పుటకును నైన నెవని తరము !

నీ జనతాభి రక్షణము నీయది, దానికి నేరవేని, నే
నే జయశాలినై పరుని నిర్జితు చేయుదు, ఇంక నీవు నీ
వాజుల తోలుచుండు మొకపాటిగ నైనను, కాని భీతితో
భూజనమున్ భగంబుధుని ముంచగ జూడకుమోయి ఉత్తరా !

—o—

## శ్రీ సత్యనారాయణ, విశ్వనాథ

### యుద్ధమేనా!

నెత్తురుల న్విసంబులను
నింపెడు జీవములందు ప్రాణ సం
సత్తులు నిల్వనీని ఖని
జంబుల నిప్పుల నీదు గుండులున్
హత్తిన మంచుకొండ చరి
యల్పడి పారెడి గంగ జేపులో
కోత్తర సస్యధాత్రి యగు
నో యఘముల్ హరియింప గల్గునో.

చీనావా డొకరుండు పొడ్చుకొని వ
చ్చె న్నేడు పైపైకి మా
లోనన్ మేముగ చాలమన్నటుల నా
లో రావణుల్ కంసులున్
వేనుల్ హిట్లరు లెంతమంది పృ
థ్వీన్ చాపగా చుట్టలే
దైనన్ వారెవరోను వీడెవడో ఆ
హా! నూత్న కర్మాకృతిన్.

ఒక్క ప్రాణమ్ము కాక వేఱొక్క డేది
చౌకగా లేనియట్టి యీ సమయమందు
ప్రాణములుకూడ ప్రియముగా నాచరించు
నట్టి చైన్లు ప్రశంసల కర్హుడగును.

మా మంత్రుల మార్పించెడి
ధీమంతుడు క్రుస్చేవు తెలివి నెఱుగడో
ధీమన్మణియగు చైన్లా
మా మంచితనమ్ము నింక మన్నించ డహో!

నీ వొక్కండవు నీవుగా నిలువగా
నేర్పంగ లేవందుచే
రావయ్యా మము చేరనంచు పిలువన్
రా చీనివా డయ్యయో
నీవున్ యుద్ధమటంచు నెంచెదవు కా
నే కాదు యుద్ధంబు నీ
వేవైపో యొకవేపు మొగ్గుము మఱిం
దే వీ మహాయుద్ధముల్.

ఐనను యుద్ధంబే యిది
రానీయము చీనివాని రాడున్ వాడున్
కానిమ్మని వచ్చినచో
తేనే లే మిద్దఱమును లీలగదయ్యా.

—(౦)—

శ్రీ సత్యనారాయణమూర్తి, బూరెల

## హల్లో మిష్టర్ చైనీ!

హల్లో! మిష్టర్! చైనీ!
చవ్వేన్‌లై సైతానీ!
పొగరుబోతు దీవానీ!
పోరా ఓ బెయిమానీ! ॥హ॥

పరాయిరాజుల దోస్తీ
మరగి, పట్టితివి మస్తీ;
పొరుగువారితో కుస్తీ
జరిపితివీ జబర్దస్తీ ॥హ॥

వెఱ్ఱి ముదిరినా నేస్తం!
ఎందుకురా చాదస్తం;
ఆలోచించుము దూరం
తెలిసిపోవు నీ నేరం ॥హ॥

శతృకూటమును చేరీ,
మిత్రద్రోహం కోరీ
మీద బడితివా వారీ!
మించిపోయె నీ "సారీ" ॥హ॥

దురాక్రమణ తలపెట్టీ
దౌత్యమార్గమును పట్టీ
భరతభూమి కాలెట్టీ
బ్రతికిపోవుదే? పొట్టీ! ॥హ॥

హలో, చైనా గద్దార్ !

అరే! చైన దుర్మార్గా! హలో! ఖబర్దార్ !
క్రూరమానసా ! పోఫో । పోరా గద్దార్ !
నీచుడ, కుటిలాత్ముడ ! దుర్నీతివి; 'డాకూ !'
కాచుకోర ! మా శక్తిని। గజిబిజి పడకూ ! ॥అ॥
నరహంతక ! చవ్వనులై ! నమ్మకద్రోహీ।
దురితాత్మా ! చైనాసుర ! ఛీ ! దుర్మోహీ ! ॥అ॥
రజాకార్ల ముఠా రీతి। రణరంగమునా
'హజామత్తు' కాగలరు । అరుగుము చీనా ॥అ॥
గర్వంబున నోడలు మఱచి। కన్ను బ్రామి, మా
ఉర్వీపైన కాలు మోపితే? । పన్నగమా ! ॥అ॥
దురితాత్ముల, దుర్మార్గుల। దుష్టమైత్రిచే
అరయవైతి ముందుచూపు । అత్యాశలచే ॥అ॥
వీరమాత భరతమాత । మాదు తల్లిరా !
ధీరాత్ములు భారతీయ శూరులు గనరా ! ॥అ॥
ఉఱుము ఉఱిమినట్లు ఉఱిమి । తఱుముదు రోరి !
అఱయవేమిరా ! వినలేదా ? రణభేరీ ! ॥అ॥
తరతరాల మా వారల దండి శౌర్యమూ
నరనరాల మాలో నుండె, సత్యము గనుమూ ॥అ॥
కర్మభూమి మా దేశము ధర్మభూమిరా !
మర్మము విడనాడి మంచి మతిని పెంచరా !
అరే! చైన దుర్మార్గా ! హలో ! ఖబర్దార్;
క్రూరమానసా ! పోఫో । పోరా ! గద్దార్ !

# శ్రీ సత్యనారాయణాచార్యా, ఉత్సం

## త్యాగానికి సమయ మిదే

చీనా సామ్రాజ్యవాది! చీ ఛీ యుద్ధోన్మాదీ!
తిరిగిపో - తిరిగిపో - సరిహద్దులు విడిచిపో!
భరతావని నీ పాపపు పాదాలను ఉంచినావు
భారత జనతా హృదయము ప్రజ్వరిల్ల జేసినావు
పంచశీల ఒప్పందము వంచన కావించినావు
శాంతికాముకుల మీదను సమరము సాగించినావు
స్నేహ సామరస్యములను చెడగొట్టుక పోయినావు
పొరుగునున్న దేశాలను దురాక్రమణ జరిపినావు
అమాయికుల నీ ప్రజలను సమూహాముగ చంపినావు
ప్రజ కన్నము పెట్టలేక ప్రాజెక్టులు కట్టలేక
సకల దేశములమాదిరి సభ్యత సాధింపలేక
శాంతిగ పదిమందితోడ సహజీవన మిష్టపడక
విజ్ఞానపు వీధిలోన వెస పురోగమించలేక
యుద్ధమనే నెపమున సరిహద్దులలో నీదు ప్రజల
ప్రాణాలను వ్యర్థముగా బలిపెట్టగ పూనినావు
ప్రజాస్వామ్య పాలనలో భారత దేశాభివృద్ధి
నీ వోకడవె చూపోపక నిప్పులు చెరిగించినావు
అంతర్జాతీయ రంగమం దశాంతి రేపినావు
నేటి యీ ప్రపంచమెల్ల నిన్నొకనినె నిన్నొకనినె

దురాక్రమణదారునిగా మరియాదకు దూరునిగా
ఒక మిత్రద్రోహినిగా యుద్ధ మదోన్మాదునిగా
వెలిడి చూపిస్తున్నది వేయికండ్ల చూస్తున్నది.
నవభారత యువకులార ! నౌజవానులార రండు !
ప్రతివ్యూహ దాహకులై ప్రతిఘటనోత్సాహకులై
రండో రారండు రండు ! రణభేరీ నినదం బదె !
త్యాగానికి సమయమిదే ! ధైర్యానికి సమయమిదే !
శౌర్యానికి సమయమిదే ! స్థైర్యానికి సమయమిదే !

నీదు తరము యువలోకము నిర్వీర్యం బనిపించకు
భరతమాత శత్రువులకు శిరమొగ్గిన దనిపించకు
ఇరుగు పొరుగు వారలచే పిరికిపంద లనిపించకు
చైనా ఒక జపానుకే శత్రువగుట కాదిప్పుడు
స్వేచ్ఛగోరు జగతికెల్ల చీనా ఒక్కటె శత్రువు
బంగారమె కాదు మాదు ప్రాణాలను ధారపోసి
సరిహద్దుల రక్షింతుము శత్రువులను శిక్షింతుము
అంగుళమైనను శత్రువు హస్తగతము కానీయము
దగాకోరు చైనీయుని దరిదాపుల రానీయము
వీరాగ్రేసరులారా ! భారత సైనికులారా !
నలభై కోటుల భారత నరనారీ జనమెల్లను
మీ వెంబడి నిలుచున్నది మీకు రక్షగా నున్నది
దురాక్రమణదారులపై ద్రోహులపై దుష్టులపై

శత శతఘ్నులను పేల్చుడు చాపకట్టుగా కూల్చుడు
నీహార ధరాధరమున నెత్తురేర్లు పారించుడు
శత్రు రక్తముల చేలకు జాలిచి సాగొనరించుడు
శాంతిభద్రతల పేరటి సస్యములను పండించుడు
మగువలార ! మీ రందఱు మాంచాలలు కావలయును
ఖడ్గమిచ్చి మీ పతులను కదనానికి పంపవలయు
విమతారి పరంపరలను వెంపర లాడింపవలయు
పండించుడు రైతులార ! పంటలు ఇబ్బడి ముబ్బడి
శత్రువుపై పోరాటము జరుపుడు ఎగబడి తెగబడి
బకాసురుని చంపబోవు భారతభీముని కన్నము
బండ్లకు బండ్లకు నింపుడు బలవంతుని గావింపుడు
భారత కార్మికులారా ! పారిశ్రామికులారా !
అహర్నిశలు చెమ్మటోడ్చి అధికోత్పత్తిని జేయుడు
అరులకు సమ్మెట పోటులు అగు మీ చెమ్మట బొట్టులు !



శ్రీ సాంబశివరావు, పోతుకూచి

## నేటి మన కర్తవ్యం

చైనా పద్మవ్యూహాలు
జగత్తుకే ఒక సవాలు

ఆయుధం చేపట్టి గట్టి పట్టుతో
ఆహవానికి సిద్ధపడేవాని
మానసిక బలాన్ని
మరలించే యత్నమే
మారణ యుద్ధం
మానేశా మనడం-

రాజనీతి గాజు నీతిలా
రాయిదెబ్బకే రాలిపోతే
నక్కజిత్తుల నంగనాచి దేశం
ఎక్కడికి పోతుంది చిక్కకుండా ?

కోటికి పడగలెత్తడం
కాదు మన కర్తవ్యం
కోటలా నేడు దేశాన్ని
రక్షించడం మన కర్తవ్యం
చైనా పద్మవ్యూహాలు
జగత్తుకే ఒక పెద్ద సవాలు.



శ్రీ సింగరాచార్యా, శేషభట్టర్

## లేరా భారత వీరా

లేరా భారత వీరా! లేరా భారత పౌరా!
లే-లేరా భారత పౌరా!
దురాశతోడుత చైనా జరిపెడి
దురాగతాలను రూపుమాపి యా
పరాయి దేశపు కిరాతమూకల
బిరానపోయి తరిమికొట్టగా ॥లేరా॥
ధారాళముగా విరాళములను
రక్షణనిధికై తక్షణ మిచ్చి
నరాల రక్తపు కణాల నిచ్చి
నిరూపింపు నీ దేశపు భక్తిని ॥లేరా॥
వెలగల బంగరు నగలనుగాని
చలి పోగొట్టెడు వలువలు గాని
పలురకముల నీ కొలది సహాయము
సల్పి నిల్పు నీ దేశపు హద్దుల ॥లేరా॥
వీరులెందరో పుట్టినారు మన
భారతదేశపు పవిత్రభూమిలో
కురుక్షేత్రమున గూల్చెను పగతుర
వెఱపు లేక వీరాభిమన్యుడూ ॥లేరా॥
బలిగొనె శత్రుల
బాలచంద్రుడు
ఏక ఛత్రమున నేలె శివాజీ
రణవీరుడు మన రాణాప్రతాపు
మరచిపోకు మన అజేయశక్తిని ॥లేరా॥

## శ్రీ సీతారామమూర్తి చౌదరి, తుమ్మల

### దేశరక్షణ

అరరే! యెంతకు సాహసించితివి! స
        త్యాహింస లశ్రాంతమున్
బరమార్థం బని నమ్మి సర్వవసుధా
        బంధుత్వ మాసించు మా
భరతక్షోణికె చిచ్చువెట్టితటరా!
        పాపాత్మ! చైనీయ! నీ
తెఱగున్ గన్గొని దేశదేశములు ధిగ్
        ధిగ్గ్రావముల్ చేసెడిన్,

ఏ మసమర్థతన్ బడి య
        హింసకు నొగ్గినవార మంచు నే
మేమొ తలంపబోకుము స
        హిష్ణులుగా జగదేకవిక్రమ
స్థేములుగా మమున్ దఱిమి
        దిద్దు మహాత్ముడు గాంధి మా మన
స్సీమల నేటికిన్ గల డ
        జేయ మహాస్సముదీర్ణమూర్తియై.

కత్తిని గత్తితో నణప
        గా దని పల్కెద, మింతెకాక యీ
నెత్తురుకూడు కీ డని య
        నిన్ దెగనాడిన కీడ్పడి ధైర్యవి

చ్చిత్తియు నింద్యవృత్తి యని
చెప్పెద; ముత్తమ ధర్మరతుకై
యెత్తిననా డగత్య మగు
నేని వరించెద మస్త్రశస్త్రముల్.

అసురుసురై గడించుకొని
నట్టి స్వరాజ్యము, బాపుజీ తపః
ఫలపమ్ముగా బయల్పెఅసి
పరిస్తుతిగన్న స్వరాజ్య, మిప్డు నీ
బుసబుస కుల్కి క్లైబ్యమున
బురింగి త్యజింపము; రిత్తరిత్తగా
నసువులు కోలుపోక జగ
మౌ నన వచ్చినతీరివ బట్టుమా!

ముక్కిడిమూక జూచుకొని
మోహమునం బడబోకుమోయి! మా
యొక్కొక భారతీయభటు
డొక్కొక వజ్రపుముక్క సుమ్మి! తా
నెక్కటి కయ్యమందు యము
నే నెదిరించుట కోపాటిల్ల; డీ
పెక్కువ కొత్త గాదు కని
పించు యుగమ్ములనుండి మొక్కలీ!

ఇద్ధచరిత్ర భారత మ
హీ మహిళన్ విన వాక్కొ! ధీరుతా
విద్ధముగాని డెందమున
విశ్వజనస్తుతి దక్కె నీమెకున్;
క్రుద్ధభుజంగివంటి దను
కో మ్మది కోల్తలసేయుపట్లు; మి
యుద్ధతి దూల్ప మాయువతి
యొక్కతి చాలునురా! దురాశయా!

తొలిగెల్పుం గని సంబరంపడుచు గం
తుల్వెట్ట కోరోరి! మున్
తులువల్ పెక్కురు విఱ్ఱవీగి తుద కా
ర్తుల్ గారె కయ్యాన; మా
వలనన్ ధర్మువు నిల్పి యుంట సమర
వ్యాపార మేపార మం
జులరోచిన్ జయలక్ష్మి మాకెదురు వ
చ్చున్ జేపు ముమ్మాటికిన్.

అచ్చపు మంచుగొండ నెల
వై వెలయున్ బరమ ప్రసన్నతన్
నిచ్చలు ప్రొద్దుపుచ్చు మహా
నీయుడు మా శశిమౌళి రుద్రుడై

చిచ్చుఅకన్ను విచ్చునటు
చేసితి వక్కట! దుర్నివారమై
వచ్చెడి యీ మహోవిలయ
వహ్నికి నీఱయిపోక నిల్తువే.

నీతో నెందఱు బూదిపాలగుదురో
నీ బుద్ధి నూహింపకీ
శీతాద్రిన్ నవరక్తధాతుపటలిన్
సృష్టించి దృష్టించుచున్
జేతఃప్రీతి గడించుకో దలచితే!
చీచీ! భవత్క్షుద్రపుం
జేతల్ రోతలు గూర్చె జాలు నిక ని
స్సీ! దుర్విదగ్ధక్రియల్.

లోకమునెల్ల నొక్క త్రుటి
లో మసిచేసెడి మారణాయుధా
నీకము పుట్టి నేలకును
నింగికి వ్రేగయినట్టివేళ నీ
దూకులు ఝాంకులీ కదన
దోహల మేటికి వల్లకాటికా?
నీ కనులింత గ్రుడ్డివగు
నే! పరికింపవు సర్వనాశమున్.

చిచ్చుఱకన్ను విచ్చునటు
చేసితి వక్కట! దుర్నివారమై
వచ్చెడి యీ మహోవిలయ
వహ్నికి నీఱయిపోక నిల్తువే.

నీతో నెందఱు బూదిపాలగుదురో
నీ బుద్ధి నూహింపకే
శీతాద్రిన్ నవరక్తధాతుపటలిన్
సృష్టించి దృష్టించుచున్
చేతఃప్రీతి గడించుకో దలచితే!
చీచీ! భవత్క్షుద్రపుం
చేతల్ రోతలు గూర్చె జాలు నిక ని
స్సీ! దుర్విదగ్ధక్రియల్.

లోకమునెల్ల నొక్క త్రుటి
లో మసిచేసెడి మారణాయుధా
నీకము పుట్టి నేలకును
నింగికి వ్రేగయినట్టివేళ నీ
దూకులు బాకు లీ కదన
దోహాల మేటికి వల్లకాటికా?
నీ కనులింత గ్రుడ్డి వగు
నే! పరికింపవు సర్వనాశమున్.



నీ కిలువేల్పు బుద్ధు; డిది
నిన్నటిమొన్నటివార్త కాదు; హిం
సాకులమై వగర్చు జగ
మాతనిధర్మమె తారకమ్ముగా
జేకొన జూచువేళ నసి
చేకొని వచ్చితి వేమి? యేమి యీ
మైకము? దుగ్ధమున్ వదలి
మద్యము కోరినయట్లు తోచెడిన్.

సత్యము వట్టి కల్లయని
చాటదలంచి కుతర్క ధోరణిన్
నిత్యము వాగినన్ నిలుచు
నే? మనకున్న యుగాలనాటి సాం
గత్యము మట్టిలో గలిపి
కాఱులు ప్రేలకు; మెంతచేసినన్
వ్యత్యయ మేలవచ్చు? విజ
యంబె వశంపడుగాక పాడికిన్.

(ఆల్ ఇండియా రేడియో వారి సౌజన్యంతో)



## శ్రీ సీతారామశర్మ, కోట

### ప్రళయోర్మి

చలిమల చెంతగాదె సుమ
సాయకు డేచి యురుల్ బిగించబోన్
నిలువున బుగ్గియయ్యెను త్రి
నేత్రుడు నిప్పులు గుప్పునంత ఆ
తొలికత మాదు డెందముల
దొల్లె. సరే, చయినా పిశాచి 'చా'
తులువకు పండె పాప మిక
ధూర్త దురంత దురాశ త్రెళ్లగన్!

నలుబదికోట్ల పైబడు జ
న మ్మొకటాయెను భారతాత్మగా
నిలచె మహోద్ధతిన్ పెలుచ
నింగిని ముట్టు మహాబ్ధివీచియై
నలుగడ చుట్టి "దుష్ట చయి
నా" తుదముట్టగ మట్టుబెట్టు ఈ
ఇల కలుషాత్మ చైదముల
కెల్ల వినాశము తప్ప దెప్పుడున్.

'ఒక్కని కెన్మిదై' మడియ
ఉగ్ర భయావహాకేళి సల్పు మా
నిక్కపు టుక్కువీరులు-ఘ
నీభవ ధైర్యతరోరు మూర్తులై

ఉక్కణగింతుఱి గఱిక్కన-మ
        హోద్దతి నెక్కొని తుక్కుతుక్కుగా
వ్రక్కలు ముక్క చెక్కలుగ
        పాపపు పుట్టుల మిమ్ము చైనియా.

తరతరాల నరనరాల తగులుకొన్న
నల్లమందు మత్తులు నెత్తి నల్లుకొనెనె ?
హద్దు పద్దులేని కుటిల కుఱిద్దబుద్ది !
మచ్చరాల ముఱిచ్చా ! ఇంక చచ్చితివిలె.

బారుల మోహారించరుల
        మార్కొని-మూర్కొని వారి రక్తముల్
పారగ జేసి మీరు చని
        వారిత సాహస శక్తియుక్తు లే
పారగ పాఱిణ మాన ధన
        మాత్మలనెల్ల పణమ్ము బెట్టుచున్
భారతికిన్ స్వరాజ్య పరి
        పాలన నిచ్చెడు భారతీయులున్.

ఆభరణము లేవి ? ఆయుధముల బూని
        తే ! వీరనారి ! ఇదేమి కతము ?
అనురాగ మేదయ్యె ? ఆగ్రహావేశ పూ
        రితుడవో యువకుడ ! కత మదేమి ?

బోసినవ్వు లెచట ? ఫూత్కార భీకరా
కార తాతయ్యా ! ఏకతమొ ఏమొ
తప్పటడుగు లేవి ? ధర క్రుంగ చెంగు చెం
గున వత్తె పాపకతన మదేమి ?

ధర్మవీర రసస్ఫూర్తి తాండవించు
కర్మభూమిపై నూర్జితోగ్రాగ్రహమ్ము
ప్రళయ విలయాత్త నాట్య సంరంభ మిద్ది
దుష్టచైనా నికృష్టుపై దూకు డూర్మి.



# శ్రీ సుప్రసన్నాచార్యులు, కోవెల

ఈశ్వరుని ఇంటిపైకి దండెత్తియున్న
శత్రు దానవు నిర్జించుకొరకు నవ వ
ధూనయన దీప్తి కెడమైన దోర్బలునకు
పార్వతీదేవి నయన దీపములు రక్ష!

మనుజుల పురాణ సంస్కృతి మధువు లొలికె
అటకు దండెత్తివచ్చె నీ యాత్మహంత
అతని నిలువున దహియింప నడుగునీకు
భారతీదేవి వాగ్వజ్రభాతి రక్ష!!

వృత్రుడేచును మహిషుడై యితడు మరల
వచ్చె నీతని హరియించువరకు సర్వ
సౌఖ్యములు వీడి అనిసేయు సాహసునకు
భార్గవీదేవి స్మితకాంతి పరిధి రక్ష!!!



శ్రీ సుబ్బన్న, సి. వి.

## చైనా తిరోగతి

గగనోద్ఘర్షి తుషార శేఖరము
గంగా మంగళాంభః ప్రచా
ర గరీయః పటు జాట జూట
విలసత్ప్రాలేయ రుక్ఖండ స
మ్యగహీనాభరణుండు శంకరుడు
గేస్తై కాపురంబున్న చో
టు గణేయంబగు దేవతాత్మ
గిరి తట్టుంజేరె రతుస్తుతుల్.

పరమ నిర్వృతి వైభవ స్ఫురితవృత్తి
మురిసి స్వారాజ్య సౌఖ్యానుభూతి బెరసి
స్థిర సమాధి నిర్మగ్నుడై తేజరిల్లు
స్వామి శాంత గంభీర భావమును దలచి.

కవిసిన అద్యపుం బొరల గన్నులు
నెత్తికి వచ్చి కొమ్ము శే
న్గువలె జెలంగి, మంచు మలకున్
వెనుకం బడియున్న రక్కసుల్
బవర మొసంగి, యామికుల
జాఱగద్రోలి, శతఘ్ని నాళికా
గ్ని వమ దనర్గళాగ్ని విధురమ్ముగ
నార్పి పరాక్రమించినన్.

ఖుర ఖుర పుట ఘట్టనముల
బరితః పరివల్గ దుగ్ర వాలాగ్రమునన్
దురితోద్యములన్ జమరుచు
దిరుగంగొట్టుచును నంది తిండిగ్రించుటయున్.

శక యవన బర్బర పులిం
ద కిరాతాభీర ముఖ్య నానా విలయ
ప్రకట కృపీట భవాకృతు
లు కోటులు జనించి దిక్కులు గదల నడరెన్.

అడరిన విశ్వతోముఖ మహాయుధ
పాణి చమూ సమూహాప్రుం
బొడవును గాంచి, డొంకలను బొంచిన
దుర్జనసేన వెన్కకున్
నడచినదయ్యో, నద్దతి చన్ దనయంత;
సదేమి చిత్రమో!
పడుట నిజంబకాదె మితిపట్టని
యుచ్ఛ్రియభావ మందినన్.



## శ్రీ సుబ్బరామశాస్త్రి, పైడిపాటి

### నెత్తురు పేరు

నెత్తురు పేరులు పారనీ
కుత్తుకలే తెగిపోవనీ
మాదేశం మేం రక్షిస్తాం
మాదేశం మేం రక్షిస్తాం.

కొండలలో చలిబండలలో
ఎండలలో మరి ఏడనైన
గుండెలుతీసిన బంటులనైన
గుండెలు చీల్చి దండిస్తాం

గుండుదెబ్బకు లొంగం-వైరుల
గుండెలొ గుండులు పేల్చిస్తాం
ఎత్తుగ జెండా ఎగరేస్తాం
మొత్తం వైరుల మొత్తేస్తాం

మాదేశం మేం రక్షిస్తాం
మాదేశం మేం రక్షిస్తాం.

ముందు మొనను నిలువరా
పందవోలె పారకురా
బందిపోటు దొంగ పట్టి
బందీగా చేయరా

భారతీయ సోదరా
పరుగిడి వే పదవేరా
వీరుడవై ధీరుడవై
ధీరుడవై శూరుడవై.

విజయము నీదేరా
వీరస్వర్గ మున్నదిరా
గజగజ లాడించి వైరి
గజిబిజి గావించవేర.

ఝణతు ఝణాం
ఝణతు ఘణాం
ఝణ ఝణ యని
సాగరా;

గణ గణ గణ
గణ గణ గణ
గంటలు మ్రోగేనురా ॥ముందు॥

మేటి భారతీయుడా! కి
రీటి వౌచు సాగరా
దేవదత్త మొత్తరా
నీ వైరి మొత్త మొత్తరా.

ఉత్తరమున పగఱజూచి
హుంకరించి నడువరా
ఎత్తి వచ్చువారి నిట్టె
ఉత్తరించరా.

గాండీవమె చాలునో
కావలెనో పాశుపతము
గండరించినట్టి యరుల
చెండి చెండి విడువరా.

కండ కలిగి నడువరా
కొండ పిండి సేయరా
నీ కెదురటరా-అడ్డ
మూక లేక సాగరా ॥మేటి॥



## శ్రీ సుబ్బారావు, రాయప్రోలు

### పిలుపు

మేలుకోవోయి భరతపుత్రుడ !
మేలుకోవోయ్ చిరచరిత్రుడ !
పిలుచుచున్నది వీరభారతి
ఎలుగు వినబడ అంతటన్,

నీ మాతృదేశంపు సీమలన్నీ నేడు
ఏమాయెనో చూడు ఏమరికలో నుండ.
మంచి మాటాడుచూ వంచించి నమ్మించి
అట్టై తెగిపడ్డాడు
పొట్టి చీనావాడు. ॥మేలుకో॥

తూర్పు తలకడదొంగ తోడేళ్లు మూగినవి,
ఉత్తరపు వాకిండ్ల ఉద్రేక మెగసింది,
ఎఱ్ఱ చీమంలపుట్ట నెఱ్ఱపడి పగిలింది,
వెఱ్ఱి సేనలమంద
చుట్టుపట్ల దిగింది. ॥మేలుకో॥

లేవరా పాలుమాలిక లింక చాలించి,
కట్టరా నీ వీరకాశె నడుము బిగించి,
పట్టరా ఒక చేత భద్రి భగవద్గీత
పట్టరా ఒకచేత
పదును పెట్టిన కత్తి ॥మేలుకో॥

కుల కక్షలో ఎన్నికల మొత్తు కోళ్ళలో
పరిమిట్ల తెరచాటు తిరగండ్ల పాటలో
చీకటి బజార్ల సినీమాల లాఖాల
ప్రొద్దస్తమానాలు
పోర్లి తేలడమాయె. ॥మేలుకో॥

కసిపోని ముసలి నక్కనుచూడు నట్టింట,
కనిపెట్టు తలకొటివి కామేళ్లు పుట్టింట,
కల్ల వేదాంతాలు కపట సిద్ధాంతాలు
పడగ ముడిచిన పాము
పగ నమ్మరాదోయి. ॥మేలుకో॥

ఈ హిమాలయ సీమ-ఈ నదీనద పంక్తి-
ఈ మహారణ్యాలు-ఈ చరాచరకోటి
ఏనాడు వెలిసెనో-ఏ ఋషులు పెంచిరో
నేడు నాదంటూడు
నెట్టుకొని వచ్చాడు. ॥మేలుకో॥

తలచీర చెరిగినా-పొలిమేర జరిగినా
జాతిపేరు ప్రతిష్ఠ సన్నగిలి అడగారు,
తిప్పించి మళ్లించి తిరగరాని విధాన
కొట్టరా చీనీల
గట్టు దాటేదాక. ॥మేలుకో॥

నూరు పువ్వులు పూచి-నూరువన్నెలు విచ్చి
ఇరుగు పొరుగుల తోట లెదగాలె నంటాడు
చీనా దగాదారి జిత్తు పన్నాగ మిది.

కాడి విరిగినగాని
కథ పూర్తి కాదోయి. ॥మేలుకో॥

స్నేహాల ముచ్చట్లు-ద్రోహాల మంత్రాలు
కల్లకపటాలొక్క కడవలో నింపాడు
బయిసిమాలి పరాకు పడరాదు-విడరాదు

లేవరా నీజాతి
లావు చేవలు మెరయ
కొట్టరా చీనీల
గట్టు కావలిదాక ॥మేలుకో॥



## శ్రీ సోమసుందర్, ఆవంత్స

### చైనా వృత్రదంబోళి

మధుర మధుర నిక్వణాల సముశ్రుతుల ఏకాంత హృదయాల
నులివెట్టే బాధలు భయాలు దుఃఖాశ్రువులు-మంటల
రేపే సంజవెలుగులో నా గుమ్మం పొదిగిట ఒదిగి
దాగున్నవా రెవరు ?
ఎవరి భాగ మిక్కడ దాచేమని వచ్చారు ?

మానసిక రోగాల సమర భీతావహాల నయంచేయగల
చేవగల శాంతియుత సదాలోచనా మూలికల
నా నుంచి వేరుసేయు కుతంత్రంతో, కుట్రతో
నిరీక్షిస్తున్నారల్లే ఉన్న దెవ్వరు మీరు ?
మనసు మరచిన పరాకుల మందసంలో దాచుకున్న
సున్నితంపు పరదాలలోని సరదాల పరపర చింపేందుకు
వచ్చారా ? తరతరాల గతానేక జీవిత వృత్తాల రత్నకంబళ్ళు
దులిపేందుకు, జ్ఞాపకాల రాల్చేసేందుకా మీరు ?

మచ్చికోలుమాటలు చెలిమి నటించి వలపు కలల పోకిళ్ల తలపించి
దగా జేసి జులుం జరుప పూనిన వంచకులా, గోమాయువులా ?
ఘనతర పదజాలంతో నన్ను సంబోధించకండి !
నిజతత్త్వం తెలిసింది మీరు గోముఖ వ్యాఘ్రాలు !
ఆర్భాటాల మేఘాళిని నాపైకి తోలకండి !
ఏ వికటాట్టహాసాలు గాని వినిపించనేరని ఈ గహన గహ్వరాన
నే నేకాంత హార్మ్యాన్ని నిర్మించుకున్నా నదృష్టవశాన;
నా సుమపేశల హృదయాన్ని దురాక్రమించకండి,

ఖరాబు చేయకండి, వికారాల ఖురాలకాల ప్రోగించకండి.
దుర్ మోహాల త్రిశ్రగతి రగడలతో జగడం సాగించకండి.
నా గడప తొక్కకండి, నా యెదద నలుపకండి, తొలగండి!
భూతకాలమహారణ్యమధ్యంలో ప్రేతకంఠాల దావాగ్నిచ్ఛటలై
మండే క్రూరాతిక్రూరమైన మీ అతుల్ని సారించకండి!
భయంకరమైన సుమజీవన విహ్వాలమైన ఆ అర్ధరాత్రిని
జ్ఞాపకం చేయకండి; నా మూపున పాపాల బస్తాలు త్రోయకండి!

నా యీ శాంతినివాస గృహాలక్ష్మి వసుంధరను చెరచకండి;
ఘోరాల ఉపద్రవాల విపద్రవాలను ప్రసరించకండి;
వైదొలగండి సత్వరం, వైహాయసం గర్జిస్తోంది వినిపించుకోండి;

మీరంతా మిమ్మల్ని మీరే మరచిపోయినవాళ్లు,
భూతకాల ప్రేతాత్మలతో జీవిస్తున్న వాళ్లు,
పరకాయ ప్రవేశంచేసి చచ్చిన గొఱ్ఱెపొట్టేళ్ళు,
మళ్ళీ ఎప్పటికీ రాజత్వం సిద్ధించదు; మీరు పాపాల బళ్లు;
మీ దేహాన్ని చేరి మహారాజ్ఞి నాకమించుకొని
అనుభవిస్తున్నాడు హాయిగా దురహంకారి విశ్వకర్మ....
చాలు చాలు ఇంక దయచేయండి; మీరు మారిపోయారు.
అప్పటివాళ్ళు కారు, నా భూదరకుడ్యాల దాటలేని కప్పలు!

కొంబూతల అరవింద హృదయాల మాలికల కూర్చుకొని,
ఆహ్లాద మరందాల పంచుకొని,
హర్షవర్ధనీకాసారతటంపై కూర్చొని,
మంచి తలంపుల మధుర స్వప్నాల మార్చుకొన్న

తపఃఫలాల పూరా పంటల్ని నూర్చుకొన్న
కౌముదీ పరిమిళిత శుభ తరుణాల మరచిన బత్తెలు మీరు.
లేనిపోని పేర్మిల నొలికించి ఉచ్చుల పన్నకండి;
వంచనల కుచ్చుటోపీల తగిలించకండి !

ధరాశా విస్తరణ దుర్మార్గంతో సౌజన్యం చచ్చి
పశుత్వం రెచ్చింది మీలో ! సౌందర్యం చచ్చి
పిశాచం నిలిచింది మీలో ! సోదర భావం చచ్చి
స్వోదర భావం మిగిలింది మీలో !

ప్రకృతిమాత లాలిత్యం పరిఢవిల్లుతూన్నది నాలో....
రామణీయకత్వాల నవమాధ్వీకరసాలు మరుగుతున్నవి నాలో !
విరాజమాన మానవత్వాల పురాచరితల సాగరతరంగాల
నవనవోన్మిషిత యౌవన శంఖధ్వని
అనునిత్యం మ్రోగుతున్నది నాలో !

అంచేతనే మీ అత్యాచారాల భరించలేను, కుహనా
యోచనలతో కుళ్లుతూన్న మీ ముఖం చూడలేను;
నాద తపస్వినైన నా జపతపాల మకరంద మందాకినిలో
మీ దురాశా కాలకూటవిషం కలుపకండి;
నా మొగసాలల తెరచుకొనిన తలవాకిలినుంచి
తొలగండి; సదాశయాల రంగవల్లుల చెరపకండి;

పేశ్రీమల అగరుధూపాల పరిమళించు మునివాకిట
పాశ్రకటమగు దుర్వాసనా నిశ్వాసాల వెదజల్లకండి.
కురూపాల విరూపాతుల్ని ప్రదర్శించకండి.

గంభీరంగా నిలచి అలవోకగా కన్నులెత్తి తిలకించే
మహోల్లాస లాలసమూర్తి మంతనమే నా రూపం—
నిజం, మానవీయ నయనం; నా శాప విస్ఫులింగాల
కెఱవైయె భస్మీపటలం కాకండి, తొలగండి తొలగండి,
నా దారి కడ్డం రాకండి, కశ్మలాల రువ్వకండి;
నా పవిత్ర ధ్యానాన్నరికట్టకండి; నా ధ్యాసల్ని విరచకండి;
సముల్లాస నవోన్మేష ప్రణయోత్సవ స్రోతస్వినిలో
మామక మానససరోవరంలో-కశ్మలాల కల్మషాల
కిల్బిషాల టన్నులకొద్దీ ఒంపకండి! దుర్ యోగాల
నింపకండి! స్వనాశనాన్ని చేపట్టకండి!........

మంచి మనసుల క్రౌంచ మిథునాల వేటాడుతూ బ్రతికిన
తిరుగుబోతు నిషాదులు మీరు, సజీవ కుసుమాల
సుగంధాలు మరచిపోయిన నిశాచరులు మీరు.
ద్వేషానలాన్ని కురిపించకండి; ఓ హారి సాహారిగా
దుష్ప్రచారాల రోగక్రిములు రాల్చకండి.

మధుస్వప్నాల బృందావనాల మహోత్సాహ నగ శిఖరాల
విడచి గడచి మరచిపోయారు హృదయాన్ని;

మానవీయ ప్రవర్ధనా మహోత్సాహ సిద్ధాంతాన్ని;
సుస్వాంతాహ్లాద శాద్వలాల నులివెచ్చని కోర్కెల
గుర్తించలేవు మీ గుండెలు, రాబందులు వాలిన రాతిబండలు!
నడవండి నడవండి!

మీ రనవరతం ద్వేషించే సౌజన్యం నాకు ప్రేమాతి ప్రేమపాత్రం
స్నేహం, సహజీవన రసతుందిల శాంతిమయ మధుపాతం!
కనుకనే మీరు నాకు శత్రువులు; వృత్రాసురులు,
సావేశిత హృదయంతో విశ్వంభరా కవితామతల్లికి
నేను కూర్చే నూతన సౌందర్యదామాల సహించలేరు;
పొండి పొండి! - అశక్తి దుర్జనత్వంగా
అరుగ్రిలు సాచుతారేమి నడవండి; వెనక్కు నడవండి!

—(o)—

# శ్రీ హనుమచ్ఛాస్త్రి ఇంద్రగంటి

## దొంగలున్నారు జాగ్రత్త!

కన్నతల్లి కైశ్యంలో
కడిముపూవు కైలాసం-
అమలామల మందాకిని
అమ్మహార సువిలాసం-

　　చీనా దుశ్శాసనునకు
　　చిక్కిందా తల్లి వేణి;
　　కుటిలవైరి కోరచూపు
　　కోరిందా మణిహారం.

శాంతి ధర్మ సూత్రాలకు
సత్యాహింసల నీతికి
కట్టువడిన భరతజాతి
వట్టి భీరులనుకుందా?

　　పిరికి కండలేని నరుల
　　పురిటిగడ్డ యీ దేశం
　　పూని 'సాదు రేగిన తల
　　పొలమున నే' నిలుచునా?

నెత్తురుడికెనేని గుండె
నొత్తి మంట లెగసెనేని
నలుబదికోట్ల భుజా లొక
నాడు కత్తులై లేచును.



## శ్రీ చంద్రమౌళిశాస్త్రి, బెల్లంకొండ

### పదండి ముందుకు

ఎవడాద్రోహి!? సుపర్వ పర్వత శిఖాహీరంబుపై చేయి వై
చి వివాదించెడివాడు! మైత్రివమనే చేసాచి నీచాతినీ
చవిధిన్ శాత్రివమూని కయ్యముకు కాల్జాచున్ గృతఘ్నుండెవం
డు! విదారింపుడు చీనిఘోణి మదకండూతిన్ మహాభారతుల్ -

సీమాక్షామముపట్టి ద్వేషమున
వచ్చెన్ నల్లమందున్నదన్
ధీమాతో! పరికింపుడీ ఎవరిదో
ధీరేఖయున్ దాఖలా
నామాల్!! మానవ మానసంబు పయినా,
నాదన్న సోదన్నవా
దామోదంబులు?! దేవతాత్మపయినా,
దర్పాంధ సంబంధముల్ ?

నలుగురు నోటిలో నుమిసినన్ బిడియం పడ డీత డేతడో
ఖలుడు! పదండి ముందునకు! కండలు చెండిననాడుగాని చెం
పలు చెడవేసికోజనదు! భారత శాంతి భుజంగమేచి నా
ల్కలు వెదరోజు రోజువర కాతడు బోడు! పదండి ముందుకున్!!

కొలువై భారతమాత కోట్లపుత్రిరాల్, కోటాన కోట్లాకరాల్
జిలుగుంబంగరు గుండెదండి తనముల్, చిద్రూప కోపోగ్రశే
ఖలవే ! ఏకముఖాకృతిన్ బొలిచె దుర్గాదేవివై యొ శత్రుర
క్తలతాంతమ్ములు విచ్చు వెచ్చని అలంకారమ్ము నేడై వడిన్!!-

ఏ బౌద్ధం బిది ! ఏమి మార్క్సిజము !
సుంతేనిన్ దయాధర్మక
ర్మాబాధంబులబోని హీనులకు !
దుర్దర్పంబు దీర్పంగ చీ
నా బాణాసురహస్తముల్ నరుకు
సన్నద్ధుల్ మహోరుద్రులై
జీబుల్ గట్టి పురోగమింపుడు
జయశ్రీ దెఁడు లెండో ప్రజల్ !

సభ్యతలేని మానవుడు చచ్చిన, నున్నను, నొక్కటే ! దురా
హేభ్యుని తోడివానిగ సమీక్ష యొనర్చిన భారతీయ వా
ల్లభ్యము గేలికొట్టిన అరాతికిరాత విఘాతుకంబు సం
క్షుభ్యము జేసి తీరువరకున్ విరమింపకురా ధృతవ్రతా !-

## శ్రీ పిచ్చయ్యా శాస్త్రి, దీపాల

### ప్రబోధము

చిలిపి బుద్ధిఁ జేసి చీనా దురాత్ముండు
హద్దు మీఱి కడు నహంకరించి,
కదిసి కయ్యమునకు కాల్ద్రవ్వుచున్నాఁడు
లేచిరండు వాని పీఁచ మడఁప.

'చీనా ఇండియ భాయి భాయి' యని
సుస్నిగ్ధ ప్రసంగంబులన్
తేనెల్ చిందఁగఁ జేయుచున్,
కపటమైత్రిన్ గోముఖ వ్యాఘ్రమై
యీ నాఁడిట్టి దురాక్రమమ్మునకుగా
నెత్తెత్తి నాఁ డట్టి దు
ర్మానిన్ ద్రోహిని మట్టు పెట్టక
సహింపం జెల్లునే యేరికిన్ !.

సామమునఁ జూచి చూచి నెహ్రూ మనీషి
మోహరము తీర్చి నిల్చి నాఁ డాహవమున
వానికిని బుద్ధి చెప్ప; నిప్పట్ల మనము
సాయపడవలె మన మహా నాయకునకు,

మారణ యంత్రవాత్రము
జీరికిఁ గ్రైకొనక పిడుగు చిట్లిన క్రియఁ దెం
పారఁగఁ జొరఁబడి హోరా
హోరిగఁ బోరెదరు మన సహోదరు లరుగో!.

భారతదేశరక్షణకు ప్రాణములొడ్డి పెనంగుచున్న హం
వీరుల కండగా నిలిచి, విత్తసహాయ మొనర్చి యుద్ధ సం
భారము లందఁ జేసి,పగవాని మదం బడఁగించి, గెల్పు జెం
డా రహి నిల్ప దీక్షగఁ గడంగుఁడు నిశ్చలధీర చిత్తతన్.

కడగండ్లమారి చీకటి బందిఖానలే
రమణీయ శర్మహర్మ్యము లటంచు
ఓకిలింతలు తెచ్చు తూకంపు మెతుకులె
షడ్రసోపేత భోజనములనుచు
క్రూర భటాళి కఠోర గర్జణములే
యాప్త సల్లాప వాక్యములటంచు
కృపణాధికారి నిర్దిష్ట కృత్యంబులే
మహనీయ పుణ్యకర్మమ్ములనుచు

నెంచి సహియించి యరుల సాధించి మనము
కొన్న స్వాతంత్ర్యమును వృథా కోలుపోవఁ
దగునె! దర్ప మెలర్పఁ దదక్షణమున
కాయితము కం డహో భారతీయులార!

# శ్రీ రంగారావు, మాదిరాజు

## హిమజ్వాల

ఈ ఉషస్సాహిత్య వీధుల
రెక్క విప్పిన మొగిలు నీడలు !
ఈ నిశా నిద్రాంబరమ్మున
సాశ్రు శిఖల విషాద స్వరములు!

ఈ ప్రశాంత మహాకాశము ఒక్కసారిగ
మృత్యు తాండవ రవము విన్పించు నేమిది ?
ఆ హిమాలయ కందరాసీమ మ్రోగెడి
కృతఘ్నతాభర శతఘ్నిచయ యత్నములు !

ఈ గడ్డపై వీచు శీతలవాయువులు
        సదా సుమనోభిరామములు
రివ్వున దూసి చను పదను కత్తులవోలె
        ఎదకు భాసించునవి యేమి ?
ఆ హిమ భూమి కదలు సైనిక నేత్రములు
        వదలు సర్పదృశాగ్ని కీలాచయమ్ములో !

పురాణ వీధీ చరన్మనోజ్ఞ దేవతా
సమూహా సమూహా దీపించు నివసనము
హత్యాబుద్ధి ఇట చరించెడి జీవులెవ్వరు ?
సూర్యతేజము మ్రింగ నెంచెడి మబ్బు మూకలు !

శత పత్ర ముగ్ధ వదనముపైన
నెత్తురు గంట్లు వలె అంతలో
హిమ శీతల స్వచ్ఛ భూమిపై
అగ్ని కణముల వోలె భాసించి
మూకలు మూకలుగ వచ్చి పడు
కాల ముద్రా మూర్తు లెవ్వరు ?
శాంత తేజో లీన రేఖాదేవి
హిమాచ్ఛ సుషమా ఫాలతలమున
అగ్ని కీలలు రక్త ఝురులు సృజింప
నెంచెడి చీకటి ముద్ద యెవ్వడు ?
ప్రతి భారతీయుడు విడిచిన
ఒక్కొక్క కోష్ణ నిశ్వాసమ్మె
తమో రాత్రి వలె భయదమై
దీర్ఘమై హిమభూమి చుట్టినది !
ఒక్కొక్క హృదయమ్మె రవి
బింబ సదృశ తేజస్ఫూర్తి
చీకటి శవము కాల్చగా
పండు నిప్పుఃను చెరగినది !
ఉదయాస్తమయ దివా రాత్రములు
ఋతువులు కామనల కాస్థానములు
క్షణములు, తుటిలో మరచి సర్వము,
ప్రదీప్త మతియై; గగనమెత్తున
ఫణసహస్రము విప్పి నా జాతి
నిలచినది కాలభుజగము రీతి.

నిప్పు గప్పిన నివురు గాలికి లేచెను
ఎవని చూచిన ఒక్కొక్క డగ్నిగోళము !
ఎవని హృదయము ఎంచిన దుఃఖభరితము
బాడబాగ్ని వహించు మహా సముద్రము !
స్వేచ్ఛా సమాజ రిరక్షా వ్యగ్రమై
నాదేశమే చైతన్య సంభృతమై
మేల్కొని జ్వాలవలె శతకోటి ముఖముగ
తేజోఽసహ్య మయ్యెను శత్రుకోటికి !
కొండవలె నిలచి కదలిక లేక
కలల తూగెడు జాతి కాదిది.
చెలియలి కట్ట ఎరుగని వార్నిధి
నిత్య భాస్వర దేవతామతి.
మహోదాహము గొన్న కాలము
రక్త ఝురులను కోరుతున్నది
కాలమును కబళించనీయము
ఖడ్గ వ్యూహము విభేదింతుము !
ఎదపై నిప్పుల కుంపటి
దింపిన ఆ కృతఘ్నులను
తుద ముట్టింపగ త్వరగా
హిమ జ్వాలలను ఆర్పగ
జ్యోతిర్ధూమ జల సంభృత
నవ ఝుంఝూహుంకృతితో
ఉరుములతో మెరపులతో
రణవ్యూహ నవమతితో
కదలుము నేఫా ప్రాంతము !
తరలుము లడక్ భాగము !

## శ్రీ వేంకటశేషశాస్త్రి, గడియారము

### జయపతాక

అరెరే! యెంతటి మోస మెంచి
రిపు డున్నట్లుండి చైనీయ ము
ష్కరు లీ భారతభూస్వతంత్రతకు!
నే స్తంబాడి నమ్మించుచున్
గుటిగా వెన్నున బాకుపోటటు
పిరంగుల్ ప్రేల్చు సైన్యాలతో
సరిహద్దుం గడ లాక్రమించిరి
దురాశాధూత దుర్భావులై.

మోస మదొక్కటా! ప్రతిన పూనిన
యచ్చపుఁ "బంచశీల" కు
ద్వాసనచెప్పి; బుద్ధునిమతంబున
కెగ్గొనరించి, స్నేహ వి
శ్వాసము లగ్గిఁబెట్టిన కసాయులు
నేఁడిటు వచ్చినారు చై
నా సరదార్లు ధర్మపరిణద్ధము
భారతమున్ జయింపఁగన్.

శాంత్యహింసాత్మ ధీ ధర్మ సత్త్వబలము
సాధనముగాఁగ స్వాతంత్ర్య సమరజయము

గొన్న మనపై కవే తుపాకులు పిరంగు
లెత్తుకొని వచ్చి; రెట్లు జయింపఁగలరొ !.

ఆయతవిక్రమక్రమ ని
    రంకుశ వీరవిహారులైన రా
మాయణభారతస్తుత
    మహారథులన్ గనినట్టి భారత
శ్రీ యిపుడేమి కాన్పడిగి
    చేవ దొరంగెనె? నేఁడు లేరె చై
నీయుల కుత్తుకల్ దఱిగి
    నెత్తురు లానెడు వీరసింహముల్!

ఉన్నారిప్పుడుఁగూడ నాఁటి
    యభిమన్యుల్ బాలచంద్రోపముల్
కన్నయ్యల్ రణతిక్కనల్ ;
    కలరు ఘూర్ఖాలున్ మరాటాలు సం
పన్నజాతులు రాజపుత్ర
    మలబార్ పంజాబు సింహంబు లీ
యన్నల్ దమ్ములు చుట్టుముట్టి
    రిపుసైన్యశ్రేణి చెండాడరే !.

భారతభూప్రతిష్ఠ నిలుపన్
    బురుషోపమ ధీరమూర్తులై
పోరిన వీరమాత లభిభూత
    సపత్నులు వీరపత్నులు

న్నారిటఁ గార్యఖడ్గనిపుణల్
తొలినాఁడును నేఁడుగూడఁ, ద
ద్వీర విహారముల్ తుడిచి పెట్టవె
ముట్టిన శత్రుసేనలన్.

వీర క్షేత్రము, వేదశాస్త్ర విలస
ద్విజ్ఞానవిద్యా కళా
ధార క్షేత్రము - భారతంబు -
హిమవద్గంగాదిక క్షేత్ర తీ
ర్థా రామస్తుత పుణ్యభూమి -
ఋషిదేవావాస; మిచ్చోట చై
నారక్షో రణభేరి మ్రోగిన
నకాండ క్షోభ మఃప్పొంగదే !.

ఈ పరిస్థితిరాదు - రానీయకుండఁ
జూచుచున్నాఁడు శివుడు త్రిశూలధారి
శీతనగముపైఁ గైలాసశిఖర మెక్కి
ప్రమథగణముతో నిజధర్మపత్నితోడ.

చేతఃప్రీతిఁ బ్రపంచరాజ్య పతులు౯
జేదోడుగా భారత
స్వాతంత్ర్యంబును శాంతి సౌఖ్యముఁ
బ్రజాస్వామ్యంబు రక్షింపఁ జే

సేతఁ సైనిక శస్త్ర సాధన ధన శ్రీ
యిచ్చుచున్నారు; చై
నా తంత్రింబులు సాగ నీ కిపుడు
సన్నాహంబు సంధింపుఁడీ !.

'ఆయతమైన ధర్మబల
మండగనున్నది, దేశదేశముల్
సాయము చేయుచున్న' వని
జాగొనరింపఁగ రాని దిప్డు చై
నీయులతోడి యుద్ధ; మవి
నీతియు వంచన యస్త్ర శస్త్ర సై
న్యాయతిఁ గూర్చి పేర్చు నభియాతి
యలంతుల పీగిపోవునే ?,

ఐనఁ, భారతజాతి యేకమయి
సర్వాయత్తతఁ నిల్చి, నె
హ్రూ నేతృత్వముక్రింద
జాతి మత వైరుద్ధ్యాదులఁ వీడి, గాం
ధీ నిర్ణీత పథంబునఁ జయము
సాధింపంగ మున్దూకుబో
చైనా దాడి మరల్చు టెంత
భరత స్వాతంత్ర్య యోధాళికిన్.

రణము గాదు-ప్రజా స్వామ్య రాజసూయ
యజ్ఞ మిది-సాగుచున్న దత్యంత దీక్ష;
ధన కనక శస్త్ర వస్తు వాహనము లెల్లఁ
దెచ్చి యర్పింపుఁడో భారతీయులార !.

రాష్ట్రపతి కృష్ణుఁ, డిందు సర్వప్రధాని
విజయుఁడే యెందు, రక్షణవిధికి చ్యవనుఁ
డల మహారాష్ట్ర వీరాపరావతార;
మగుట ధర్మమే గెల్చు; జయంబు మనదె !.

హిమగిరి యన్న లోక జనయిత్రికి
దుర్గకుఁ బుట్టి నిల్లు; త
ద్విమల ఝరీ దరీ విపిన వీధి
విహారము లామె కింపు; ర
మ్యము లవియెల్ల నేఁడు
రిపు మర్దితముల్ శవ రక్త మాంస దూ
ష్యము లగు దృశ్య మామె
హృదయంబున నగ్గి రగుల్ప కుండునే !.

కోయని హుంకరించి యదిగో
రణదుర్గ కరంబునన్ త్రిశూ
లాయుధ మెత్తి, మున్ను
మహిషాసుర శుంభ నిశుఁభ ముఖ్య దై
తేయులఁ బోలె నిప్పుడు
వధించుచు నున్నది మూఁగియున్న చై
సీయుల; నింక భారతము
నిర్గత శాత్రవమై వెలింగెడిన్ !.

కనుక నంతిమ విజయమ్ము మనది నిజము
దైవబలముతో మనకుండె ధర్మబలము
ప్రబల జాతీయతా ప్రజాబలముఁ బెంచి
శాత్రవులఁ దోలి యెత్తుఁ డీ జయపతాక !.

# శ్రీ సత్యనారాయణ శాస్త్రి, మధునాపంతుల

## ఆ వా హ న ము

అదనెంచి మథియించు నందాఁకఁ గడుపులో
　　నమృతంబు దాఁచుకొన్నట్టి యబ్ధి
తఱి వచ్చి చిలికెడి వఱకు దారువు వోలెఁ
　　బడియుండు తీరుఁ జేపట్టు నరణి
సమయమ్ము చూచి యుత్తముఁడు చెప్పెడిదాఁకఁ
　　దన విక్రమముఁ గప్పుకొనెడి హనుమ
యుత్తరాయణ సువేళోదయం బగుదన్కఁ
　　దన దీప్తి ముకుళించుకొనెడి తరణి.

యసదృశ తపస్సమాధి భంగాంతరమునఁ
గాక కను విచ్చునట్టి పినాకపాణి
దురవగాహ గభీర యుద్ధర కృపాణి
మజ్జనని పుణ్య భారత మహిత ధరణి.

ఏది! యేదీ!! యొకసారి యొక్కపరి
　　తల్లీ! చల్లనౌ నీదు కన్
తుదఁ గ్రోధారుణిమంబు చిందు
　　మఱె విందు లోఁవియు నా బోఁటిక
రక్త దరిద్రియకు నోట; నీ కినుక
　　చాలల్ మేరగా నమ్రితన్
ముదమారన్ భవదంఘ్రిలం
　　దడవికొందున్ భారతోర్వీ పవిసూ !.

వెలిదమ్ముల్ నెలరేలు మల్లె విరులున్
        బెంపారు ముత్యాల పే
రులుఁ గ్రొమ్మించులు మంచు పొంగులును
        నీ రూపంబుగా నెంచి క
న్నులలో వత్తిడు కొంచు నిన్నుఁ
        గనుఁగొందున్ నీ పదాబ్జాత రే
ఖలు మత్ప్రాలతలంబు సోఁకి
        యెలు పెక్కన్ జక్క దీవింపవే !



"అజంతా"

పూర్తి పేరు : పెనుమర్తి విశ్వనాథశాస్త్రిగారు

చిరునామా : ఆంధ్రప్రభ, విజయవాడ.

జననం : *1929*

"ముక్త ఛందస్సు"



"అణ్ణన్"



పూర్తి పేరు : ప్రతివాదిభయంకరం అణ్ణజ్గరాచార్యులు

చిరునామా : ఆదయ్యా మెమోరియల్ హైస్కూలు,
సికింద్రాబాదు,

సుపరిచిత భాషలు : తెలుగు. సంస్కృతం, హిందీ,
ఇంగ్లీషు.

'ఉత్సాహం గల రచయిత.'

శ్రీ అప్పలస్వామి, పురిపండా.

చిరునామా : విశాఖపట్టణం-1.

జననం : *13-11-1904.*

సుప. భా. : తెలుగు, హిందీ, బెంగాలీ. ఒడియా.

రచనలు : మురళీధ్వని (కవిత), సౌదామిని, విశ్వకథావీధి (కథలు),
వీరభారతం (చరిత్ర).

"అనువాదాలు కొల్లలు"



## శ్రీ అబ్రహాము, నూతక్కి

చిరునామా : కొలకలూరు, తెనాలి తాలూకా,

జననం : *7-3-1923*

సువ. భా. : తెలుగు.

రచనలు : మత్కుణం, పిడుగులు, జీసస్.
మధురకవి.

## శ్రీ అయ్యవారు, T. B. M.



చిరునామా : వీరశైవ కళాశాల, తెనాలి తాలూకా.

జననం : *7-3-1923.*

సువ. భా. : సంస్కృతము, ప్రాకృతము, తెలుగు, ఇంగ్లీషు, కర్ణాటము.

రచనలు : పల్నాటి వీరచరిత్రము, దేవీత్రిశతి మున్నగు కావ్యాలు.
"కవి పండితులు"

## "ఆరుద్ర"



అసలు పేరు : భాగవతుల శంకరశాస్త్రి.

చిరునామా : 1-శివప్రకాశం వీధి, మద్రాసు-17.

జననం : *31-8-1925.*

సువ. భా. : తెలుగు, ఇంగ్లీషు, తమిళం.

రచనలు : త్వమేవాఽహమ్, సినీవాలీ, గాయాలు గేయాలు, (కావ్యాలు) కథలు-
"బ్రెయిన్‌లో బెన్‌గన్"

## శ్రీ కృత్తివాసతీర్థులు, తల్లావఝ్ఝుల.

చిరునామా : సి. ఎస్. ఆర్. శర్మ కాలేజి, ఒంగోలు.

జననం : *10-1-1914.*

సుప. భా. : తెలుగు, సంస్కృతం, పాళీ, హిందీ.

రచనలు : హరిచరణుడు (నవల), భార్యల సమ్మె (వ్యంగ్య రచన), చైనా రోదనం (నాటకము) ము॥

## శ్రీ కృష్ణమాచార్య, దాశరథి.



కలం పేరు : దాశరథి.

చిరునామా : ఆలిండియా రేడియో, మద్రాసు-4

జననం : *10-12-1927.*

సుప. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ.

రచనలు : (కావ్యాలు) అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, మహాబోధి, పునర్నవం. గాలిబ్ గీతాలు ము॥

అగ్ని కురిపించగలరు
అమృతం ఒలికించగలరు

## శ్రీ కృష్ణాచార్య, కాశీ.

చిరునామా : గుంటూరు.

"ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థాన కవి"

## శ్రీ కొండమాచార్య, ముదివర్తి.

చిరునామా : గూడూరు, నెల్లూరుజిల్లా.

జననం : *15–7–1923.*

రచనలు : ధర్మదీక్ష. అమరసందేశం, వీరమనీడు ము॥ కావ్యాలు.
గేయరచనలో సిద్ధహస్తులు.

## శ్రీ గోపాలకృష్ణ శాస్త్రి, కనకదండి.

జననం : *26-6-1909.*

సువ. భా. : తెలుగు, సంస్కృతము.

రచనలు : (కావ్యాలు) ఎలమావి, సెలయేఱు.

## శ్రీ చిన్నికృష్ణ శర్మ, దేవరకొండ.

చిరునామా : బిషప్ అజరయ్యా బాలికోన్నత పాఠశాల, విజయవాడ-2.

జననం : *26-10-1906.*

సువ. భా. : తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు.

రచనలు : భక్త త్యాగరాజు, (నాటకము), నూటపదార్లు (కావ్యము), నేతాజీ భారతము (జీవిత చరిత్ర), భారతి (నవల), కథా సరిత్సాగరము మున్నగు అనువాదాలు.

## శ్రీ జాషువా, గుఱ్రం.

చిరునామా : గోపాలకృష్ణయ్య తోట, గుంటూరు.

జననం : *28-9-1895.*

సుప. భా. : తెలుగు, సంస్కృతము.

రచనలు : (కావ్యాలు) పిరదౌసి, గబ్బిలము, ముంతాజ మహలు, ఖండకావ్యాలు ము॥

వ్యథిత హృదయం
పదను కవిత్వం

## శ్రీ జోగారావు, యస్వీ.

చిరునామా : ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

జననం : *2-10-1925.*

సుప. భా. : తెలుగు, ఇంగ్లీషు.

రచనలు : (కావ్యము) పంచకళ్యాణి.



## శ్రీ జ్ఞానానంద కవి

చిరునామా : మెక్లారిన్ హైస్కూలు, కాకినాడ.

జననం : *16-7-1922.*

సుప. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు.

రచనలు : (కావ్యాలు) తరంగమాల, గాంధీ. అమరగీత, వసంతగానము, పాంచజన్యము, ప్రభంజనము ము॥

"కవి కోకిల", "కవితా విశారద"

## శ్రీ నారాయణరావు, కాళోజి.

చిరునామా : నక్కలగుట్ట, హనుమకొండ, (వరంగల్లు).
జననం : *9-9-1914.*
సువ. భా. : తెలుగు, హిందీ, మహారాష్ట్రం, ఉరుదు, ఇంగ్లీషు.
రచనలు : కాళోజీ కథలు, నా గొడవ. (కావ్యం)

వెన్నలాంటి హృదయం; వేమనలాంటి కవిత్వం



## శ్రీ నారాయణరెడ్డి, సి.

చిరునామా : నిజాం కాలేజి, హైదరాబాదు.
జననం : ప్రజోత్పత్తి.
సువ. భా. : తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ.
రచనలు : (కావ్యాలు) నాగార్జున సాగరం, కర్పూర వసంతరాయలు, వెన్నెల వాడ, దివ్వెల మువ్వలు.

"గేయాలకు మువ్వలు"



## శ్రీ నారాయణాచార్య, పుట్టపర్తి.

చిరునామా : కడప.
జననం : *28-3-14.*
సువ. భా. : తెలుగు, సంస్కృతం, ప్రాకృతం, తమిళం, మళయాళం, కన్నడం, మరాఠీ, బెంగాలీ. హిందీ, ఇంగ్లీషు, గ్రీకు, లాటిను.
రచనలు : పెనుగొండ లక్ష్మి, సాక్షాత్కారము, శివతాండవము, అగ్ని వీణ, మేఘదూతము, గాంధీ మహాప్రస్థానము, పండరీ భాగవతము, జనప్రియ రామాయణము ము॥

"శివ తాండవము"

## శ్రీ పద్మనాభస్వామి, యామిజాల

చిరునామా : 8-B· తిలక్ రోడ్డు, త్యాగరాయనగర్, మద్రాసు-17.

జననం : *1924.*

సువ. భా : తెలుగు, సంస్కృతం, హిందీ.

రచనలు : (కావ్యం) విక్రమ ప్రకృతి, కృష్ణదేవరాయలు, దక్షిణ నాయకులు (జీ. చ.).

"విద్వాంసులు"

## శ్రీ పాపయ్యశాస్త్రి, జంధ్యాల.

కలం పేరు : కరుణశ్రీ.

చిరునామా : ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.

జననం : *4-8-1912.*

సువ. భా : తెలుగు, సంస్కృతం, హిందీ.

రచనలు : ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ ము॥

"తేనెకలం"



## శ్రీ ప్రసన్నాంజనేయులు, పాతూరి.

చిరునామా : సెంట్రల్ రైల్వే, తాండూరు.

జననం : *1927.*

బాలల గేయాలు విరివిగా వ్రాశారు.

## శ్రీ బలరామాచార్య, మడిపడిగ.



చిరునామా : జనరల్ బజారు, సికింద్రాబాదు.

జననం : *11-8-1926*

సు వ. భా : తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు.

రచనలు : (కావ్యాలు) మేనకా విశ్వామిత్రము, ఉమర్ ఖయ్యాం అమర గేయాలు, గుడిగంటలు, ఏడుకొండలు, శ్రీశైలము పాంచజన్యము.

"కలం, కుంచె కదలాడును"



## శ్రీ బాలగంగాధర తిలక్



చిరునామా : తణుకు.

జననం : *1923.*

"విప్లవపథం"

## శ్రీ భాస్కరరావు, టి.



కలం పేరు : స్ఫూర్తిశ్రీ.

చిరునామా : ఏ. సి. కాలేజి, గుంటూరు.

సు వ. భా : తెలుగు, హిందీ, సంస్కృతం, ఇంగ్లీషు

రచనలు : దేవయాని, కన్నీటిజాలు, అహల్యా, మహాశ్వేత ము॥ కావ్యాలు. శకుంతల, ఆనందమఠం ము॥ నవలలు.

"విమర్శ"

## శ్రీ భీమన్న, బోయి

చిరునామా : Chief Translator to Govt. of A. P., Hyderabad.

జననం : *1912.*

సుప. భా. : తెలుగు, ఇంగ్లీషు.

రచనలు : దీపసభ, మధుబాల, రాగోదయం, కావ్యాలు, జానపదుని జాబులు ము॥

"సహజకవి"

## శ్రీమతి మంజులత, డి.

చిరునామా : నారాయణగూడెం, హైదరాబాదు.



## శ్రీ మాధవశర్మ, పాటిబండ

చిరునామా : 36/3 చిక్కడపల్లి, హైదరాబాదు.

జననం : *26-4-1910.*

సుప. భా. : తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు.

రచనలు : చారుణి, గిరికపెళ్లి (కా), రాజశిల్పి, ఇంద్రాణి (నవలలు), ము॥

ప్రఖ్యాత విమర్శకులు



## శ్రీ రంగాచార్య, దాశరథి

చిరునామా : 10-1-688 నెహ్రూనగర్,
సికింద్రాబాదు,

జననం : *12-3-1930.*

సుప. భా. : తెలుగు, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు,
సంస్కృతము.

రచనలు : శ్రీమద్రామాయణము (వచనం)
దేవునిపేరిట, పృథ్వీరాజు (నవలలు)
శకుంతల, మాళవికాగ్ని మిత్రం,
ఊర్వశీవిక్రముడు, వివేకానందుడు,
ము॥

## శ్రీ రంగాచార్యులు, బృందావనం

చిరునామా : పరుచూరు, కృష్ణాజిల్లా

## శ్రీ రమణ, యస్. వి.

చిరునామా : 10-1-688 మారేడుపల్లి, సికింద్రాబాదు.

జననం : *12-3-1944.*

సుప. భా. : తెలుగు, హిందీ, ఇంగ్లీషు.



శ్రీ రాధాకృష్ణ, పరిగి

చిరునామా : జూనియర్ ఇంజనీర్, గుంతకల్లు.

జననం : 1-7-1937.

"యువకవి"

శ్రీ రామసోమయాజులు, ఖమిడిపాటి



చిరునామా : చోడవరం, విశాఖపట్టణం జిల్లా.

జననం : 19-11-1899.

రచనలు : శివాజీ ప్రబంధం, కుచేలోపాఖ్యానం (కావ్యాలు), విశ్వలీల ము॥ (నా), జానకి, లక్ష్మి ము॥ కథలు.

"కవిశేఖర, కళానిధి"



శ్రీ రామారెడ్డి, ముకులాల

చిరునామా : జిల్లాపరిషత్ హైస్కూలు, కల్వకుర్తి. మహబూబ్‌నగరం జిల్లా.

జననం : 1929.

రచనలు : దేవరకొండదుర్గము, (కా) వీరపూజ, మనుమడు చూపిన మంచిబాట (వయోజన సాహిత్యం)

"తెలుగుసిరి"



## శ్రీ లక్ష్మణశాస్త్రి, కప్పగంతుల

చిరునామా :

జననం : *5-12-1917*

సువ. భా. : తెలుగు, సంస్కృతము, ఉర్దూ, మహారాష్ట్రము, కన్నడము, హిందీ, తమిళము, ఇంగ్లీషు.

రచనలు : మణిమంజూష, (కథలు) ఆంధ్ర వ్యాకరణ వివరణము. కర్ణసుందరి, విక్రమాంక దేవ చరితము, (నా)

"ఆంధ్రబిల్హణ"



## శ్రీ లక్ష్మీనారాయణ, చర్ల

చిరునామా : కాకరపర్రు, తణుకు తాలూకా; పశ్చిమగోదావరి జిల్లా.

జననం : *6-2-1936.*

రచనలు : భారతమాత, ఈశ్వర స్తోత్రము.



## శ్రీ లక్ష్మీనారాయణమూర్తి, శ్రీపాద

చిరునామా : పార్వతీపురము, శ్రీకాకుళంజిల్లా.



శ్రీ వరదాచార్యులు, వానమామలై

చిరునామా : చెన్నూరు, ఆదిలాబాదుజిల్లా.

సువ. భా. : తెలుగు, సంస్కృతము.

రచనలు : ఆహ్వానము ము॥ కావ్యాలు.

"అభినవ పోతన"

శ్రీ విశ్వం, అరిపిరాల



చిరునామా : న్యూసైన్సుకాలేజి,
నారాయణగూడ, హైద్రాబాదు.

జననం : *31-10-1936*.

సువ. భా. : తెలుగు, సంస్కృతము. ఇంగ్లీషు,

"ముక్త ఛందస్సు"

శ్రీ విశ్వనాథశర్మ, తెలకపల్లి



శ్రీ [illegible], సున్నం.

చిరునామా: క[illegible]సమితి, విశాఖపట్టణం.

జననం: [illegible]904.

సు.భా.: [illegible]లుగు, సంస్కృతం.

రచనలు: మహాత్మాజీ అస్తమయం, శ్రీబాల యోగి, మహేశా (శతకాలు), ఝాన్సీరాణి. యక్ష ప్రవాసము (కావ్యాలు).

"కవిరత్న"



శ్రీ వెంకటరత్నం, అంబటిపూడి.

చిరునామా: ఏదుబాడు, అన్నంబొట్లువారి పాలెం, గుంటూరుజిల్లా.

జననం: *15-7-1908.*

సు.భా.: తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు,

రచనలు: ప్రణయవాహిని, ఇందధనువు' (కావ్యాలు), వీరాంజలి (కథలు), దక్షిణ (నా) ము॥

శ్రీ వెంకటరత్నం, కొనకళ్ల.



చిరునామా: 73 అశోకనగరం, ఏలూరు.

జననం: *2-9-1909.*

సు.భా.: తెలుగు. ఇంగ్లీషు,

రచనలు: పొద్దుతిరుగుడు పూలు, బంగారు మామ పాటలు. (కావ్యాలు) కథావళి.



## శ్రీ వెంకట వరదాచార్యులు, N. T. C.

చిరునామా : ప్రొద్దుటూరు, కడపజిల్లా.

"జ్యోతిషరత్న", "వాస్తు వాచస్పతి"



## శ్రీ వెంకటాచార్య, కె.

చిరునామా : రాజులకొత్తపల్లి. వయా : కేసముద్రం. వరంగల్ జిల్లా.

జననం : *5–9–1934.*

సుప. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, హిందీ.

## శ్రీ వెంకటేశ్వరరావు, నార్ల.

చిరునామా : ఆంధ్రజ్యోతి, విజయవాడ-2.

జననం : *1-12-1908.*

సుప. భా. : తెలుగు, ఇంగ్లీషు.

రచనలు : కొత్తగడ్డ (నాటికలు), జగన్నాటకం, నార్లవారిమాట (కా) మాటా మంతీ, పిచ్చాపాటి (వ్యాసములు).

"వాస్తవ చిత్రణ"

శ్రీ వెంకటేశ్వర్లు, విశ్వనాథ

చిరునామా : గవర్నరుపేట, విజయవాడ.

స్వస్థానం : నందమూరు, కృష్ణాజిల్లా.

సు. భా. : ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము.

రచనలు : దక్షిణేశ్వర ముని, కాళిందీ పరిణయము ము॥

"ఆంధ్ర గీర్వాణభాషా పండితులు"



శ్రీ వేంకట రామకోటిశాస్త్రి, కేతవరపు

చిరునామా : నిజాం కాలేజి, హైద్రాబాదు.

సు. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు.

"విద్వాంసులు"



శ్రీ వేంకటావధాని, దివాకర్ల

చిరునామా : తెలుగు డిపార్టుమెంటు, ఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాదు.

జననం : *1-7-1913.*

సు. భా. : తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతము.

రచనలు : రాజ సందర్శనము, ప్రకృతి విజయము (కా), వ్యాసావళి, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, కౌముదీ మహోత్సవము, నాగానందము ము॥

"విద్వాంసులు"



## శ్రీ శశాంక, వోలేటి.

చిరునామా : కీర్తిసదన్, గాంధీనగర్, కాకినాడ-1.

జననం : 3-4-1929.

సుప. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు.

రచనలు : నయాజమానా. రాగవల్లరి (కా).

"పూలవంతెన"



## శ్రీ శామ్యుయెల్, జి. జే.

చిరునామా : దీనబంధు నిలయము.

జననము : 9-1-1891.

సుప. భా. : తెలుగు.

రచనలు : పచ్చగడ్డిలో కుచ్చిత ప్రాణులు ము

"కవితా విశారద"

## శ్రీ శివరామారావు, వింజమూరి.

చిరునామా : ఆకాశవాణి, విజయవాడ.

జననం : 15-5-1908.

సుప. భా. : తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు.

రచనలు : అమరుకం, రసమంజరి (కా), కళోపాసన (నాటికలు) ఎన్నో అనువాదాలు.

"అరువందలదాకా రేడియో రూపకాలు"

## శ్రీ శివశంకర స్వామి



చిరునామా : తీర్థాశ్రమము, ఒంగోలు, గుంటూరు జిల్లా.

జననం : *12-9-1892*

సుప. భా. : తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతము, ప్రాకృతం, పాలి, హిందీ, బెంగాలీ, కన్నడం, లాటిను.

రచనలు : హృదయేశ్వరి, ఆవేదన, కావ్యావళి (కా), వకుళమాలిక, పద్మావతి (పద్య నాటికలు) వంగభాషనుండి అనేక అనువాదాలు.

"సాహిత్య సామ్రాట్"





## శ్రీ శ్రీరామమూర్తి, చిమ్మపూడి

చిరునామా : హిందీ టీచర్, జిల్లా పరిషత్, హైస్కూలు, మునగాల, కృ. జి.

సుప. భా. : హిందీ, తెలుగు, ఇంగ్లీషు.

"సాహిత్య రత్న"

## శ్రీ శ్రీరామారావు, శంకర



చిరునామా : గీతా క్లినిక్. ఏలూరు.

జననం : *19-6-1908.*

సుప. భా. : తెలుగు, ఇంగ్లీషు, హిందీ, సంస్కృతము.

రచనలు : పూలమాల, కృతులు-గేయములు (కా), కళాయోగి, కుటుంబ సమస్య (నాటికలు)






చిరునామా : మహబూబ్ కాలేజి హైస్కూలు,
సికింద్రాబాదు.



శ్రీ సాంబశివరావు, పోతుకూచి

చిరునామా : 208 బోయిగూడ, సికింద్రాబాదు.

జననం : *27-1-1929*

సుప. భా. : తెలుగు, ఇంగ్లీషు, హిందీ.

రచనలు : సాంబశివరావు కథలు, కొత్త విలువల బ్రతుకు (కథలు) ఉదయకిరణాలు, అన్వేషణ, ఏడురోజుల మజిలీ (నవలలు).

శ్రీ సత్యనారాయణ, విశ్వనాథ



చిరునామా : మారుతీనగర్, విజయవాడ-2.

జననం : *10-9-1895.*

సుప. భా. : తెలుగు, సంస్కృతము. ఇంగ్లీషు.

రచనలు : ఆంధ్ర ప్రశస్తి, శ్రీమద్రామాయణ కల్పవృక్షం మొ॥ 10 కావ్యాలు. వేయిపడగలు, ఏకవీర, చెలియలికట్ట ము॥ 50 నవలలు. నర్తనశాల మున్నగు 6 నాటకాలు. చిన్నకథల సంపుటాలు, ఖండకావ్యాలూ మొత్తం 50.

"కవి సామ్రాట్టు"



**శ్రీ సత్యనారాయణమూర్తి, బూరెల.**

చిరునామా : 7638-కలాసిగుడా. సికింద్రాబాదు.
జననం : *17-1-1916.*
సువ. భా. : తెలుగు, ఇంగ్లీషు, హిందీ.
రచనలు : బాలల పుస్తకాలు 20, స్త్రీల పాటల పుస్తకాలు 60, నాటకాలు 6, చైనా దురాక్రమణ గేయాలు ము॥

"మ ధు ర క వి"

**శ్రీ సత్యనారాయణాచార్య, ఉత్పల.**



చిరునామా : 12-10-161, సీతాఫల్ మండి, సికింద్రాబాదు.
జననం : *1928.*
సువ. భా. : తెలుగు, సంస్కృతం, హిందీ. బెంగాలి
రచనలు : ఉత్పలిని, తపతి, శరణాగతి, ఉత్పల మాల, ము॥ కావ్యాలు. విషబిందు ము॥ నవలలు.

"ము త్యా ల కూ ర్పు"

**శ్రీ సీతారామమూర్తి చౌదరి, తుమ్మల.**

చిరునామా : అప్పికట్ల, గుంటూరుజిల్లా.
జననం : *25-12-1901.*
సువ. భా. : తెలుగు, సంస్కృతము.
రచనలు : ఆత్మార్పణము, పరిగపంట, ఆత్మకథ, శబల, సర్వోదయ గానము ము॥ (కా).

"తి క్క న"



## శ్రీ సీతారామ శర్మ, కోట.

చిరునామా : ప్రధానోపాధ్యాయులు, జిల్లా పరిషత్ హైస్కూలు, మునగాల, నల్లగొండ జిల్లా.

జననం : *22-8-1931.*

సువ. భా. : తెలుగు, ఇంగ్లీషు. సంస్కృతము.

"రసజ్ఞులు"




## శ్రీ సుబ్బన్న. C.V.

చిరునామా : ప్రొద్దుటూరు, కడపజిల్లా

## శ్రీ సుబ్బరామ శాస్త్రి, పైడిపాటి.

చిరునామా : మాచవరం, విజయవాడ-2,

జననం : *22-8-1918.*

సువ. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు.

రచనలు : జాతీయ భారతి, జయభారతి, మధుర సంక్రాంతి ము॥ కావ్యాలు.

## శ్రీ సుబ్బారావు, రాయప్రోలు.

చిరునామా : 44-నెహ్రూనగర్, సికింద్రాబాదు.

జననం : *8-3-1892.*

సువ. భా. : తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ, హిందీ, బెంగాలీ.

రచనలు : లలిత, తృణకంకణం, కష్టకమల, స్నేహలత ము॥ కావ్యాలు

"వైతాళికులు"



## శ్రీ సోమసుందర్, ఆవంత్స.

చిరునామా : కళా నికేతన్, పిఠాపురం, తూర్పు గోదావరిజిల్లా.

జననం : *18-11-1924*

రచనలు : వజ్రాయుధం, కాహళి, రక్తాక్షి ము॥ కావ్యాలు, బానిసలదేశం కథలు.

"పిడుగు"

## శ్రీ హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి.

చిరునామా : రామచంద్రపురం, తూ. గోదావరిజిల్లా.

జననం : *29-8-1911*

సువ. భా. : తెలుగు, సంస్కృతము. ఇంగ్లీషు, హిందీ.

రచనలు : దక్షారామం, పాటల మంజరి (కా), విజయదశమి (కథలు).

శ్రీ చంద్రమౌళి శాస్త్రి, బెల్లంకొండ.

చిరునామా : ఖమ్మం.



శ్రీ పిచ్చయ్యశాస్త్రి, దీపాల.

చిరునామా : ఉస్మాన్ సాహెబుపేట, నెల్లూరు.

జననం : *29-5-1894.*

సుప. భా. : తెలుగు, సంస్కృతం.

రచనలు : ప్రణయ కుసుమము (కా). సారంగధర చరిత్రం (వ్యాఖ్య), మేఘదూతము, రఘువంశము. (కా)

"విద్వాంసులు, విమర్శకులు"



శ్రీ రంగారావు, మాదిరాజు.

చిరునామా : Research Scholar in Telugu. Arts College, Osmania University, Hyderabad.

జననం : *7-2-1937.*

సుప. భా. : తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, ఫ్రెంచి,

రచనలు : కిర్మీరం, మేలొక్కన్న ఆకాశం, మనో భూమికలు, వ్యక్తిగీతం, మరో ఉదయం (కావ్యాలు),

"అభ్యుదయపథం"

## శ్రీ వేంకటశేషశాస్త్రి, గడియారం.

చిరునామా : ప్రొద్దుటూరు, కడపజిల్లా.

జననం ; 8-8-1907.

సుప. భా. : తెలుగు, సంస్కృతము.

రచనలు : శివ భారతము (కా). శ్రీనాథుని కవితా సామ్రాజ్యము (విమర్శ) వాల్మీకి (కా).

"ప్రబంధకవి"

## శ్రీ సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల.

చిరునామా : వీరేశలింగం హైస్కూలు, రాజమండ్రి.

సుప. భా. : తెలుగు, సంస్కృతం.

రచనలు : ఆంధ్ర రచయితలు, ఆంధ్ర పురాణము (కా), రత్నావళి, రత్నపాంచాలిక (కా).

"పరిశోధకులు"

# వ్యాసకర్తలు

## శ్రీ సత్య సుబ్రహ్మణ్యం, కూచిమంచి

చిరునామా : ఆంధ్రజనత, గాంధీ భవన్, హైద్రాబాదు

జననం : *9-7-1928.*

ప. భా : తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ.

"ఆంధ్రజనత సంపాదకులు"

## శ్రీ రామానుజరావు, దేవులపల్లి

చిరునామా : ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొగ్గులకుంట, హైద్రాబాదు

ప. భా. : తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతము, ఉర్దూ.

రచనలు : నవనీతం, పచ్చతోరణం ము॥

"ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ కార్యదర్శి"

## శ్రీ పెంటయ్య, అల్లాడి

విరునామా : 7184/85 కండోజి బజారు, సికింద్రాబాదు

జననం : *1927*

"మునిసిపల్ కౌన్సిలర్"

## శ్రీ గులాం జీలానీ

శిల్పి :



N. D. D. Sculpt, London

G. D. Sculpt, Yugoslavia

G. D. Art Sculpt, Bombay

G. D. Art Painting, Bombay

L. C. C. C. in Com. Art. Painting & Pottery London

విరునామా : 5-9-358, Hyderabad - A. P.

జననం : *14-4-1915.*

శిల్పాలు : శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, రాజా బహద్దుర్ వెంకట్రామా రెడ్డి, సాలార్ జంగ్, "Fare well my heart", "Song of Victory".

